# మధ్యాహ్నమున అలసట దీర్చును

పని చేసి జీవించు స్త్రీలందరకు, విశ్రాంతి సమయమునందు మంచిదగుచున్నది టీయే. వారికి పొలములలోనో, ఫ్యాక్టరీలలోనో, మగవారికి తీసిపోకుండునట్లు శక్తి నిచ్చుచున్నది టీయే. మధ్యాహ్న టీ రాను రాను, ప్రతి భారతనారీమణి గృహమునందు ఎక్కువ వాడుకగుచున్నది. మీరొక్క జీవితమంతయు టీ నే యుపయోగించుడు.



## టీ చేయుక్రమము

శుద్ధమైన వేడినీరు, కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర, ఒకస్పూను టీ యొక్కొక్కరికిన్ని మొత్తముగా నొకస్పూను యధికముగాను పాత్రలో వేసి బాగుగా మరుగుచున్ననీటిని పోయవలయును. 5 నిమిషములు తాళి గిన్నెలలో పోసి పాలు చక్కెర చేర్చవలెను.



## ఇండియన్ టీ ఒకటే కుటుంబమునకు సరియైన పానకము

టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డుచే ప్రకటింపబడినది I K 92

# విషయసూచిక



త్రివర్ణ చిత్రము:

రాధాకృష్ణులు. చిత్రకారుడు: ఎ. ఆర్. దీనకాగారు




# గృహలక్ష్మి

'గృహలక్ష్మి'కి అత్యుత్సాహముతో మరొక సంవత్సరము గడచినది.

ఆంధ్రుల ఆదరణాభిమానములను చూరగొని 'గృహలక్ష్మి' దశవర్షప్రాయయైనది. పదునొకండవ సంవత్సర ప్రథమోపహారమే యీ సంచిక.

'గృహలక్ష్మి' గృహలక్ష్ముల పత్రిక. స్త్రీల యభ్యుదయమును గోరి తన యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడినది; పడుచున్నది.

ఈ యాశయ మీ పత్రిక యెప్పుడును మఱచి మెలుగదు. నిరంతరము దీనిని హృదయమునందుంచుకొని యుండుటవలననే ఈవఱకే 'గృహలక్ష్మి' ప్రత్యేకవ్యక్తిత్వము సంపాదించుకొనియున్నది.

దీని నీ పత్రిక సర్వథా నిలుపుకొనవలెను. కాదు- అభివృద్ధిచేసికొనవలెను.

దానికై ఇంకను ఎంతయో కృషి చేయవలసిన మాటమాత్రము కాదనము.

ఈ కృషి నిరంతరాయముగా కొనసాగవలెను. గృహలక్ష్ముల కుపయోగకరమై యుండవలెను.

అయితే—

దానికి ఆంధ్రనారీమణులు మిక్కుటముగ చేయూత నొసగవలసిన యవశ్యకతగలదు.

వారందఱు ప్రత్యేకముగ తమకొఱకై పాటువడెడి తమసోదరి కృషికి దోహదము చేయవలెను.

అభివృద్ధిని కాంక్షించి ప్రకటించు నాశయములు ఫలోన్ముఖమగుటకు బాసటయై నిలువవలెను.

ఎట్టి నూతన పద్ధతుల నవలంభింపవలెనో, యెట్టి ప్రాతపథములను విడువవలెనో తెలుపుచు సూచనల గావింపవలెను.

ఇట్టి ప్రార్థనలు సర్వసాధారణమే. అంటే-

సమాధానమున్నది. ఈవఱకు 'తరుణములు గలిగించుచున్నాము. కావలసిన వారుపయోగించుకొనుడు' అని 'గృహలక్ష్మి' ప్రకటించినది.

అయితే యీ తరుణములను గృహలక్ష్ము లుపయోగించుకొన్నవారు కారు.

తమ అభ్యుదయమునకు కారణములై ఇతర రాష్ట్రీయుల కాదర్శప్రాయములైనవి 'గృహలక్ష్మి' సూచించినపుడు దానికి సానుభూతి సహాయము స్వల్పముగా కనపడినది.

అసలుసంగతు లిట్లున్నను గృహలక్ష్మి తన యాశయముల మరొక్కమారు నొక్కి చెప్ప దలంచినది.

అదేమిటంటే?

'గృహలక్ష్మి' స్త్రీల పత్రిక. వారు తమ యభ్యుదయమునకై దానిని సద్వినియోగ మొనర్చుకొనవలెను. అట్టి యుపయోగమున కితరులను ప్రోత్సహింపవలెను.

అటులగాక—

'గృహలక్ష్మి' అరుదెంచుచున్నది. కొంత మంది సోదరీమణులు దాని నుపయోగించుకొనుచున్నారు. వారు వ్రాసినది చదివి యానందింతము; లేకున్న నిరసింతము. ఆశయములతో మనకు పనిలేదు'

అని ఊరకున్నటులైన—

తాము చేయవలసినపని యితరులకు విడువవలసివచ్చును. అది యెంతవఱకుపకరించునో వారికి తెలిసిన విషయమే.

అంతియగాక—

ప్రపంచ వాతావరణమున మార్పుల యాధిపత్య మెక్కువైనది.

ప్రతిజాతియు మేల్కొని తమ జాతీయ రక్షణకు కంకణము గట్టుకొని రానున్న అపాయముల నెదుర్కొనవలసియున్నది.

దేశదేశములను క్రమక్రమముగా ముంచుకొని వచ్చుచున్న అశాంతి ప్రవాహమును శాంతిశిలలచే అహింసా 'సిమెంటు'చే అరికట్టవలసియున్నది.

అంత యేందుకు?

స్వాతంత్ర్య సంపాదనకై భారతభూమి యెదుర్కొనవలసిన ప్రబల సమస్యలు నానాటికి పెక్కులుగా బైలుదేరుచున్నవి.

సాంఘికాభివృద్ధి, ఆర్థికబలము, రాజకీయైకమత్యము పొందుటకు స్త్రీ పురుషులు చేయవలసినకృషి అపారము.

ఈ కృషికి మూలాధారము పత్రికలు.

కాబట్టి—

'గృహలక్ష్మి' స్త్రీలకై ప్రత్యేకముగ నడుపబడుటెంత యావశ్యకమో వారికి తెలియనిదికాదు.

అందుచే వారు గృహలక్ష్మిని తమ సర్వతోముఖాభివృద్ధికి సాధనముగా నుపయోగింతురు. ఆసాధనము సర్వవిధముల నభివృద్ధి పొందవలయుననుటయు మరువరు.

'గృహలక్ష్మి' కోరిక అదియే.

'గృహలక్ష్మి' ఆశయమదియే.

అయితే—

ఇంతవఱకు మీసోదరి యభివృద్ధిని కాంక్షించి పలువిధములుగా ఆదరించినవారు అభిమానము జూపినవారు పలువురుగలరు.

వారి నందఱిని 'గృహలక్ష్మి' యీ సమయమున మరువక తన కృతజ్ఞతాపూర్వకవందనముల నందించుచున్నది.

# ఘంటానినాదము

కె. యం.

భగవంతుడు మానవకోటిని సృజించెనే గాని వారి ప్రవర్తనానిబంధనల నేర్పరుపలేదు. ప్రథమమున మానవు లనాగరికులై వింతరీతుల బ్రవర్తించియుండవచ్చు. కాలక్రమమున నాగరికతాభివృద్ధి నొందినకొలది జనులు తమలోదాము కొన్నియాచారవ్యవహారములను, ప్రవర్తనానిబంధనలను, సంఘపు కట్టుబాట్లను నేర్పరచుకొని సన్మార్గవర్తనులై, నైతికాభివృద్ధికొరకై ప్రయత్నములు సల్పియుండిరి. వారు జీవనోపాధికై సలిపెడి కృషి, వృత్తినిబట్టి కులమతభేదములుగూడ గలిగియుండెను. అవియే కాలక్రమమున పలుశాఖలై దేశమునం దనేకజాతులు, మతములుగానేర్పడి, ఐకమత్యము చెడి, భేదము గలిగి, వైషమ్యములలోదిగి, తుదకు కొట్లాటలు, కలహములు, యుద్ధములుగాగూడ పరిణమించుచున్నవి. ప్రజోపయోగములుగా సత్ప్రవర్తన, శుచి, శుభ్రత, ఆరోగ్యములకొరకై యేర్పరచిన నిబంధనలనే మూఢాభిప్రాయములతో సాగదీసి, నిలువుబొట్టు అడ్డబొట్టు భేదములు, బ్రాహ్మణబ్రాహ్మణేతరభేదములు, అంటరానితనములు నేర్పరచి, సర్వమానవ సౌభ్రాతృత్వ మంతరింపజేసి ప్రజాసంక్షోభ మేర్పరచుచున్నారు.

సంఘమనిన మిక్కిలిభయము. సంఘపు కట్టుబాట్లదాట నెవరును సాహసించలేరు. కొన్నియాచారములు ప్రజావినాశకారణములైనను సంఘబహిష్కరణ భయముచే వానినుండి విముక్తులు కాలేకున్నారు. కాని ప్రపంచపరిణామమునుబట్టి ఆచారవ్యవహారములుగూడ మారవలెను. పూర్వమెన్నడో నేసందర్భముననో పెద్దలేర్పరచిన నిబంధనలనే తూచాతప్పక యాచరించవలెనన్నచో, మార్పుజెందిన యీరోజులలో సరిపడదు. రాజా రామమోహన్ రాయి కాలమున సతియనుదురాచారమే మాన్పబడనిచో నిప్పటి కెంతమంది స్త్రీలన్యాయముగ నగ్నిహోత్రున కాహుతి జేయబడి యుండెడివారో! పూర్వాచారమునననుసరించియే నరబలులు, జంతుబలులు జరుగుచుండినచో నిప్పటి కెన్నికోట్లజీవములు బలులొనర్చబడి యుండెడివో! కాని యెప్పటికప్పుడు దేశోద్ధారకుడగు నొక మహనీయు డుద్భవించి కొన్నిసంస్కరణముల జేయుచుంటచే కొన్ని దురాచారములు మాన్పబడుచున్నవి. ప్రస్తుతము దేశము నావరించియున్న నంటరానితనమును బాప పెక్కుప్రయత్నములు సలుపబడుచున్నను, తిరువాన్కూరు మహారాజు మహారాజ్ఞివంటి సజ్జనులు త్రోవజూపినను, దేశమున నంటరానితనము తొలగకున్నది. తోడిసోదరులగు హరిజనులకు దేవాలయ ప్రవేశపుహక్కులేదు. బిడ్డలగుప్రజలలో నొక

రిపై నొకరి కసూయయుండినను, తండ్రియగు భగవంతునకుమాత్రము తనసంతతి యందఱును సమానార్హతలుగల్గి, తనకు సమానముగా సేవజేయనర్హులే. మహమ్మదీయులందరును మసీదునందే నమాజుచేయవలెననియు, క్రైస్తవులందరును చర్చినందే ప్రార్థనలు సలుపవలెననియు, ఇంక నిట్లే ఆయాపద్ధతులననుసరించి ఈశ్వరుని సేవించవలెనని యితరమతములు ప్రజల ప్రోత్సహించుచుండ, మనమతము మనసోదరులనే దేవాలయములలో ప్రవేశించగూడదని నిరుత్సాహపరచుచున్నది. భారతీయ ధర్మనిర్మాత లేకాలమునం దేపరిస్థితులలో నట్టి కట్టుబాట్లొనరించిరోగాని, ఇప్పుడవి, దేశవినాశహేతువులగుచున్నవి. హరిజనోద్యమమునందు పాల్గొనిన నొకమహనీయుని శవదహనసంస్కారమునకు సైతము ఆతని బంధుగులుగూడ పాల్గొనకుండుట సంఘభయమేగదా! కాని జటాయువునకువలె నీమహనీయునకు కాంగ్రెసురూప శ్రీరామహస్తంబున దహనసంస్కారముజరుగుట ఆయన పూర్వపుణ్యఫలితముగాదె! మతకలహములకు కారణము సంఘపుకట్టుబాట్లే. అందువలననే, నేడు దేశమునందు పెక్కుచోట్ల హిందూమహమ్మదీయులకు మతకలహములేర్పడి పెక్కురు మడియుచున్నారు.

సంఘము కట్టుబాట్లననుసరించియే నేటికిని అతిబాల్యవివాహములు మానలేకున్నారు. శారదాబిల్లుప్రథమమున నమలుజరిపిన రోజులలో సంఘబహిష్కరణ భయముచేతనే పెక్కురు తమచంటిబిడ్డలను పల్లకులందు బరుండబెట్టియైనను వివాహములుజరిపి తత్ఫలితముల నిప్పుడనుభవించుచున్నారు. బాలికలకు విద్యగరపుటగూడ సనాతనధర్మవిరుద్ధమనియే కొందరు పెద్దలతలంపు. బాలికలకు పాఠశాలలు గూడదట. స్త్రీకి వంటయిల్లేశరణ్యమై నిర్మలవాతావరణానుభవమునకైన బయటికిరాక, బిడ్డలనుమాత్రము గనుచుండుట సంఘపు కట్టుబాటు. ఈమధ్య నొక పత్రికయందొకరు స్త్రీలు స్వాతంత్ర్యమును గోరుదురాయని ప్రశ్నించిరి. స్త్రీకి స్వేచ్ఛనిచ్చినచో విచ్చలవిడిగదిరిగి, నుత జలపూరితమగు నది సముద్రుని జేరి నిర్మలత్వమును బోగొట్టుకొనునట్లును, రక్షణలేనిపుష్పమే చిలిపిమనుష్యునిచేనైనను పుణుకబడు నట్లుండుననియు, లతానికుంజములు వృక్షరాజములనాశ్రయించిననే శోభగల్గుననియు వెల్లడించి, స్త్రీకి కుమారరత్నముల గనుచుండుటమాత్రమే శరణ్యమని తెలిపిరి. నేడు స్త్రీలుగోరుస్వేచ్ఛ అట్టిదిగాదనియు, స్త్రీస్వాతంత్ర్యమన సంద్రము వంటివారితో జేరుటయు, రక్షణలేనిపుష్పమువలె పుణుకబడుటయు, విచ్చలవిడిగదిరిగి నైతికవిదూరులగుటయు గాదని వారెఱుగరుగాబోలు. అట్టిస్వేచ్ఛ నేస్త్రీయును గోరదు. అత్యంతసనాతనాపరులగువారికి స్త్రీస్వాతంత్ర్యమన నదియేయని గాబోలు నూహ. నైతికమనునది స్త్రీపురుషులిర్వురకును సమానావశ్యకతయే. స్త్రీకి ఏకపతిత్వమెంత యాచరణీయమో పురుషున

కేకపత్నీత్వము నంతయే ముఖ్యాచరణీయము. వారలకట్టి నీతియున్నచో నెవరెచటనున్నను కీడువాటిల్లదు. మనోబలమే మానరక్షణ. నీతివిదూరులగువార లింట బంధింపబడినను నైజముమారదు. నీతిపరులు బహిరంగమున స్వేచ్ఛగనున్నను వారికి మాలిన్యమంటదు. ఇదిలోకవిదితమే. కట్టడివలననే స్త్రీకి పాతివ్రత్యము నిలబడుచున్నదనియు, 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' యనియు జెప్పు అతిసనాతనుల యూహ తప్పు. స్వాతంత్ర్యజీవనముజేయుచు పురుషులవలె దేశసేవజేయుచున్న స్త్రీరత్నములందరు నవిఖ్యాతిపరులనియా వారియూహ? రక్షణలేనిపుష్పమువలె నగుచుండిరనియా వారితలంపు? పరరక్షణపై నాధారపడువారల కెంతకాలమెవరు రక్షణ మొసంగగలరు? రక్షణలేని యేసమయముననో ఫుణుకబడవలసినదే. స్వరక్షణమే రక్షణము. పతులరక్షణమున లేనిసమయమున ద్రౌపదికి భగవంతుడు మానరక్షణ మొసంగలేదా! ఆభగవంతు డందఱమెడలేడా? సీత, దమయంతి, అనసూయ మొదలగువారల పాతివ్రత్యరక్షణము స్వశక్తివలననేగదా! కాన స్వేచ్ఛాస్వాతంత్ర్యములకును అవినీతికిని సంబంధముండదు. స్త్రీ లెందరు స్వశక్తిపై నాధారపడి దేశసేవయు, మానవసేవయు జేయుచుండుటలేదు. కాలమునకానుగుణ్యముగ సంఘపుకట్టుబాట్ల మార్చుకొని దేశసేవాపరతంత్రులై ప్రవర్తించిననే దేశసౌభాగ్యమబ్బును. అప్పుడే జాత్యుద్ధరణ మగును.

ప్రపంచమంతయు పరిణామ మొందుచున్నది. భారతస్త్రీలెల్లరు స్వాతంత్ర్యాభిలాషులై యున్నారు. దేవసేవాపరతంత్రలై యున్నారు. అన్నిటిలోను వారు ముందడుగు వేయుచున్నారు. స్వార్థపరులగు కొందరు పురుషులుగాని, అతిసనాతనులుగాని అడ్డుపెట్టదలచినను కాలపరిణామమాగదు. భారతదేశ దాస్యవిముక్తి కాలమాసన్నమైనది. జేగంటమ్రోగుచున్నది. ఆఘంటానినాదము స్త్రీపురుషులెల్లర రక్తనాళములందును ప్రతిధ్వనించుచున్నది. అందరును 'భరతమాతకు జై 'యని ఏకకంఠమున నుడువుచు జోహారు లర్పించుచున్నారు. ఈశ్వరప్రసాదవరలబ్ధ భారతస్వరాజ్యవాహిని, స్వాతంత్ర్యసమరమున మడసిన యోధుల స్వర్గప్రాప్తులంజేసి, భారతీయులనెల్ల పునీతులంజేయ నురకలిడుచు ప్రవహించుచు వచ్చుచున్నది. తత్ఫలితమున ప్రజలెల్ల రిహపరసౌఖ్యముల నందెదరుగాక.

వందేమాతరం.

# స్త్రీలు-నిర్బంధవిద్యాశాసనము

స్త్రీవిద్య వ్యాప్తి కావలయునని కొందఱు నాయకులు మొఱపెట్టుకొనగ ప్రభుత్వమువారు ఏకోలది తలములలోనో బాలికాపాఠశాలలఁ గొన్నింటిని నెలకొల్పియున్నారు. కాని ప్రకృతపు పాఠశాలలెంతమాత్రమును స్త్రీల జ్ఞానాభివృద్ధికిఁ దోడ్పడుటలేదు. బాలికల తలిదండ్రులు దమ బాలికల విద్యాకౌశలమును గన్నులారఁజూచుచు వేరుమార్గ మెద్దియు గానరాక ప్రాథమిక విద్యతో బరిసమాప్తి నొందించుచున్నారు. ప్రాథమిక పాఠశాలాభ్యసనమున నక్షరజ్ఞానముమాత్ర మలవడి యుండును. అంతమాత్రపు విద్యవలన జ్ఞానాభివృద్ధి కాఁజాలక, యేదేని కార్యనిర్వహణమున జ్ఞానశూన్యత దికమకలగుచున్నారు. స్త్రీలు విద్యావతులు కాఁజాలనిచో నే కార్యమునకుఁ గడంగఁజాలరు. ప్రజలలో నధికసంఖ్యాకులు పల్లెలలో నివసించుచున్నారు. వారు నిరక్షరకుక్షులు; అమాయకులు. స్వకార్యములయందు మగ్నులై యున్న కూపస్థిత మండూకములు. విద్య జ్ఞానాభివృద్ధి నొసంగునని బోధింపబడినను దానమే ముద్యోగములు సేయఁ బనిలేదనినిరసించుచున్నారు. విద్యనభ్యసించుట యుద్యోగముసేయుటకేయని వారి యభిప్రాయము. కాని మానవశ్రేణికి విద్య ప్రధానమనియు దాన జ్ఞానాభివృద్ధియనియు, విద్యావిహీనులైనవారు పశుతుల్యులనియు వారెఱుంగుటలేదు. దాన తమ బాలురకు సైతము విద్య గఱపరాదని తలంచుచుండ నిఁక బాలికలకు విద్య కావలయుననిన గర్హింపక గ్రహింతురా? స్త్రీలు మొన్నికలలో నర్హతబొందినవారుగనుండి ఓటునొసంగు నెఱుంగక తికమకలగుచున్నారు. పల్లెలలో నీ మూఢత్వ మంతరింపఁజేయవలయును. కావున ప్రతిగ్రామములోను నిర్బంధ ప్రాథమిక బాలికాపాఠశాలల నెలకొలుపవలెను-ఎనిమిదవ తరగతివఱకు. అందుపాధ్యాయినీల ర్హతగలవారుగ నుండవలయును. దేశభాషయందు జక్కఁగ వ్రాయను జదువను నేర్పవలయును. పరిశ్రమ లభ్యసింపఁజేయవలయును. గృహాలంకరణాది విషయముల నెఱుఁగఁ జెప్పవలయును. రాట్నపరిశ్రమ ప్రధానముగనుండవలయును. తోడుగా స్థిరచర గ్రంథాలయస్థాపన అవశ్యము. ఈదేశమున బాలికలకు బండ్రెండవ సంవత్సరము రాఁగనే పాఠశాలల కనుపుటయరుదు. అట్టివారు గ్రంథాలయములవలనను, పత్రికాపఠనమునను మిక్కిలి జ్ఞానము నార్జింపనగును. కడపజిల్లాలో విద్యావిషయము దౌర్భాగ్యస్థితినున్నది. ఇందు బద్వేలు తాలూకాలో నాఱు బాలికా పాఠశాలలు మాత్రము కలవు. ఇదియా స్త్రీ విద్యావ్యాపనము? కాంగ్రెసు మంత్రులు గ్రామపునరుద్ధరణకుఁ గడంగవలయునని సూచించుచున్నారు. స్త్రీ విద్యాభివృద్ధిని గుఱించి తగుశ్రద్ధ వహింతురని తలంచుచున్నారు. స్త్రీలు స్వతంత్రముగ జీవించవలసిన సమయమున విద్యాగంధశూన్యలై యుండుట తమ స్వతంత్రజీవనమునకు నహితమొనగూడుచున్నది. ఇట్టి నిరోధమును దొలంగింప నిర్బంధబాలికాపాఠశాల లావశ్యకములై యున్నవి.

—అ. రాధమ్మ

# ఆంధ్రసినిమారంగం అభివృద్ధిని చూపుతూవుంది

'చిత్రనళీయము'—'శ్రీ సత్యనారాయణ'

— ఆంధ్రసినీమారంగం అభివృద్ధిని పొందటానికింకెంతకాలం పడుతుందోఅని అదోక విధమైన ఆవేదనతో వుండేవాళ్లలో నేనోకరు.

వున్నట్టుండి పదిహేనురోజుల అంతరంలోనే 'శ్రీరామా ఫిల్మ్స్'వారి 'చిత్రనళీయము', ఆంధ్ర టాకీసువారి 'శ్రీసత్యనారాయణ, చూడ్డం తటస్థించింది. ఆయాసం తోలగినట్టుగా నిట్టూర్పు వుచ్చాను. ఎందుకంటె యీ రెండుచిత్రాలు ఆంధ్రులు సినీమారంగంలో తా మిదివఱకు చేసివుండే లోపాలిని గుర్తించి చక్క-చేయడాని కారంభించినట్టు తోచింది. ఆదారిలో పడ్డారు కాబట్టి యింక అభివృద్ధిపొందడం సులభం. భారతదేశాన్నంతా రంజింపజేసుండే హిందీ ఫిల్ములవంటివికూడా తయారుకావచ్చు యీ విధంగా అభివృద్ధిపొందితే.

ఇలావ్రాస్తే అసలు యీరెండిటిలోనూ లోపాలు బొత్తిగా లేవనుకోడం పొరపాటు. లోపాలు ఎన్నోవున్నాయి. వాటిని సాధ్యమైనంతవఱకు చిత్రాల్లో దొర్లనీయకుండా చేయబడ్డ ప్రయత్నమే గొప్పది.

* * *

చి త్ర న ళీ య ము

కవీ, కథకుడు, ప్రదర్శకుడు అంతా ఒక్కరైతే ఆచిత్రం ఏలావుంటుంది? కవి కోకిల దువ్వూరు రామిరెడ్డిగారు చిత్రనళీయాన్ని డైరెక్టు చేస్తున్నారన్నప్పటినుండి కలిగిన ప్రశ్న ఇది. అది మనోహరంగా, కళామయంగా తయారౌతుంది అని ఇప్పటి సమాధానం. చిత్రానికి కావలసిన కథావిధానంలో కవిహృదయం ఎఱుకపఱచారు రెడ్డిగారు. దమయంతీ విరహం, నలుని దూత్యం, కలిపురుషుని కృషి, అంతర్నాటకం అట్టివి. ఈచిత్రం మొదటినుండి తుదివఱకు కళామయం. ఇంటా బయటా ప్రతిరంగంలో కూడా కళకు ప్రాముఖ్యం యివ్వబడింది. అది ప్రేక్షకుల నెంతో రంజింపజేస్తూవుంది. భాషావిషయంలోకూడ ప్రతి చిన్నిపద్యంలోను కవికృషి కనబడుతూవుంది. సంగీతంవల్ల యీచిత్రాని కేమీావన్నె వచ్చినట్లులేదు. వైరాగి సంగీతంమాత్రం బాగుంది.

నలదమయంతులు వయసు మీరిన వారుగా కనపడతారు. నలుడు—మాధవపెద్ది—తనపాత్ర చక్క-గా నిర్వహించాడనవచ్చును. శ్రీరంజిని దుఃఖపూరితఘట్టాల నటించడానికి బాగా తగివుంటుందని అనిపించింది. కలిపురుషుడుకూడా తగినవాడే. నలదమయంతుల చిన్నికూతురు_చంద్రసేన-గా నటించిన బాలిక ముచ్చట గొలుపుతూవుంది.

ఈచిత్రంలో ప్రజలను రంజింపజేసి డబ్బుగడించే ఆకర్షణవుంది.

* * *

## శ్రీ సత్యనారాయణ

ఈ చిత్రంలోకూడా 'కాసులపేరు' అను ప్రహసనము, 'చెల్ మోహనరంగా' పాటలోని అర్థం ప్రత్యక్షదృశ్యాలతోనూ చూపారు. ఇదివఱకు తయారైన తెలుగుచిత్రాల్లో చెల్ మోహనరంగా వంటి మనోహరమైంది ఇంకొకటిలేదంటే అతిశయ మనుకోకండి. దర్శకుని—శ్రీ పుల్లయ్య—ప్రతిభ అందులో స్పష్టంగా కనబడింది.

'కాసులపేరు'లోను, 'సత్యనారాయణ'లోను నవ్వించటానికి సరకెక్కువగావుంది.

పాత్రనిర్వహణానికి తగిన నటీనటులను ఎన్నుకునేదాల్లో పుల్లయ్యగారికివుండే ప్రజ్ఞావిశేషానికి సత్యనారాయణలోని నటీనటిబృందం ఒక తార్కాణం. కథలో ముఖ్యపాత్రలైన సాధుగుప్తుడు, అతని భార్య, కూతురు, అల్లుడు వీరి పాత్రల నటించినవారాయా పాత్రలకు పోతపోసినట్లున్నారు. ఇందలి పాత్రలంతా చక్కగా నటించారు. ఈ పాత్రధారు లింతవఱకు ఆంధ్రనాటక సినీమారంగాల్లో పెద్దపెద్ద బిరుదలను గడించకపోయినా బిరుదులుగలవారికన్నా బాగా నటించారు.

ఈచిత్రంలో శ్లాఘనీయమైంది ఇంకోటికూడావుంది. ఇంతవఱకు వచ్చిన చిత్రాల్లో సంభాషణలన్నీ సాగిదీసి గ్రాంథికంలో నడిచాయి. అవి కొన్ని కొన్ని ఘట్టాల్లో వినడానికి దుర్భరంగావుంటవి. దీల్లోమాత్రం ఆద్యంతమూ వ్యావహారికంగా—సహజంగా—నడిచింది సంభాషణ. ఇది ఈచిత్రానికి నిజంగా వన్నెపెట్టింది.

ఈచిత్రంలో ఫోటోగ్రఫీ చాలావఱకు చెడిపోయింది. అందులో చిత్రానికి ముందుగ చూపిన సత్యనారాయణ దేవాలయ దృశ్యాల్లో అది మరింతఘోరం.

శ్రీ సత్యనారాయణలోని కథ సాధుగుప్తుడు సంతానం కలిగితే సత్యనారాయణ వ్రతం చేస్తానని, కలిగిన తరువాత చేయకపోవడం; అతనికి పెక్కుకష్టాలు రావడం; వ్రతం చేయడంతోటే అన్నీ మాయమవడం. ఇందులో చూపెట్టిన వ్రతమాహాత్మ్యం చిత్రానికి కళంకం. ఇతరవిషయాల్లో ఎంతో సహజంగా కనపడిన యీచిత్రం వ్రతమాహాత్మ్యం ఎక్కడపడితే అక్కడంతా పదేపదే ప్రత్యక్షమై ఆభాసమైంది. కథావిషయంలో అక్కడక్కడావున్న లోపాలు గమనింపతగ్గవి గాదు.

(ల. కా.)

# జన్మసార్థక్యము - జీవితపరమావధి

"దీనశుభము లేదు దివ్యకీర్తియు లేదు, జగతిఁ బుట్టిపుట్టి చచ్చిచచ్చి
పొరలనేల మనకుఁ బుట్టని చావని, త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి."

(భాగవతము)

శ్రీమతి కె. సుగుణమణి గారు

పైది యొక జిజ్ఞాసాపిపాసుని దివ్యప్రబోధము!

మానవజీవితము మహత్తరపూర్ణమైనదని జ్ఞానులు చెప్పెదరు. మానవుడు యిహలోకమందలి భయవిషాదములనుండి విమోచనమంది, నిత్యానంద సుఖశాంతుల ననుభవించుటకు జ్ఞానమే పరమసాధనము. "జ్ఞాన"మన లోకోత్తర ప్రతిభాసంపన్నులగు మహాపురుషుల-పతివ్రతామతల్లుల జీవితఅనుభవనిశేషము. అట్టిజ్ఞానము భాషాబద్ధమయి గ్రంథస్థమయియున్నది. అట్టి గ్రంథరాజములు ఆంధ్రవాఙ్మయమున అనేకములున్నను సంసారసాగరనిమగ్నులమైయున్న మనకు యీదినములలో వాటిని పఠించుటకే తీరిక లేకున్నది. పాఠశాలలో గఱపు 'విద్యలు' మనకును మన బిడ్డలకును నిరర్థకములగుటయేగాక పైపెచ్చు అనర్థదాయకములుగూడ నగుచుంట మనకెల్లరకు విశదమే. ఈ లోకజీవనమున కనువగుశక్తి, శరీరపోషణార్థమయి భుక్తి, సృష్టికర్తపై భక్తి, యుక్తాయుక్తవివేకజ్ఞానముతోగూడిన యుక్తి, తదనంతరము ముక్తి-వీని నీయగలిగినదే నిజమగు 'విద్య'యని పెద్దలేర్పరచియున్నప్పటికిని ప్రస్తుత విద్యావిధానము ఈ దారి పట్టుట దేశదురదృష్టము.

మనము పెరిగి పెద్దవారమై, విద్యాబుద్ధులు గఱచి, ధనధాన్యముల నార్జించి, జీవనముగడుపుట యిత్యాది కర్మలన్నియు ఈ జీవితపరమావధిని పొందుటకొరకే యైయున్నను—ఆ పరమావధిమాటయే మరచి, పశుపక్షి మృగాదులవలె ఆహారనిద్రావాంఛలలో మునిగి, అపూర్వములగు శరీరమానసికశక్తులను వ్యక్తపరచి, అమూల్యమగు జీవితకాలమును వృథాపుచ్చి, యీ మూన్నాళ్ల బ్రతుకు ముక్కలు చేసికొని, మానవజీవితపు మహత్తే మంటగలిపి, అంతకంతకు అధఃపతితులమగుచున్న మనకు-యెఱుకగల పెద్దలగాంచి వారి ప్రోత్సాహములకు చెవియొగ్గి వారిమార్గము ననుసరించుటకంటె-నుత్తమకర్తవ్యము గానరాదు. ఎన్నటికైన నేవిధముగనైన కండ్లు తెరువగలిగితిమేని మన జన్మము తరింపజేసికొని, మాతృగర్భమును సార్థకపరచినవారమగుదుము. ఇది మిథ్యయని యెఱింగికొని ముక్తిగాంచుటయే జన్మసార్థక్యము; ఇదియే మానవజీవితపు పరమావధి.

అట్టి పరమావధిని జేరుటకు పల్వురు మహాత్ములు పలువిధముల చెప్పియుండిరి:—బుద్ధుఁడు, రామకృష్ణపరమహంస మొదలగు 'జ్ఞానయోగులు' యీ విశ్వనాటకమును మిథ్యగా గుర్తించి నూటిగ బ్రహ్మపదవిని చూరగొనిన మహామహులు. 'రాజయోగులు' కామరాహిత్య మలవరచుకొని, సంసారధనాదులయందలి మోహమును సులభముగవీడి, యమనియమాద్యనుచరణచే దానిని చేరవచ్చుననిరి. కబీరు, రామదాసు ఆదిగాగల 'భక్తియోగులు' పరాత్పరునిపై అనన్యభక్తి నలవరచుకొని తన్మయత్వమున జీవితముల తరింపజేసికొనిరి. "పరోపకారార్థమిదం శరీరం" అని గాంధీజీ మున్నగు 'కర్మయోగులు' ప్రజాసేవకై, దేశోద్ధారణకై, తమ జీవిత సర్వస్వమును వినియోగించి మాతృగర్భము పూజ్యమొనరించి జన్మసాఫల్యమునందిన ప్రత్యక్ష మహాపురు

ఘులు. కొందరు 'హఠయోగాభ్యాసము'న భౌతికశరీరమును తద్వారా మనస్సును తమ సంపూర్ణ స్వాధీనములోనికి తెచ్చుకొని దానిని నిర్వికల్పసమాధిలోనికి జొనిపి జీవితనిత్యానందమును ముఖాముఖి గాంచి యనుభవించి తరించు దిట్టరులు. మొట్టమొదట వీటన్నిటికిని "జ్ఞానమే" పరమసాధనము. అట్లగుట ఈజన్మమున జ్ఞానసముపార్జనము మానవునికి ఉత్తమోత్తమమైన పని.

ఈ కలియుగమున అన్నగతప్రాణులమగు మన బోటి సామాన్యమానవకోటికి భక్తి, కర్మ యోగములే సుగమ్యములని రామకృష్ణపరమహంసవారు బోధించియుండిరి. అట్లని తక్కిన విధులనుగూర్చి యెతీంగికొన నక్కరలేదనిగాదు. జ్ఞానయోగులు తమ పూర్వజన్మసుకృతఫలముచేతను, తమ నిశ్చలమననమువలనను జ్ఞానసిద్ధినిబడయు దివ్యపురుషులు. రాజయోగమునకు యమ (ఓర్పు), నియమ (నిష్ఠ), ఆసన (శరీరావయవములను వలసినరీతి నుంచుట), ప్రాణయామ (ప్రాణవాయువుల నిరోధించుట), ప్రత్యాహార (ఇంద్రియనిగ్రహము), ధారణ (మనోనిశ్చలత), ధ్యాన (కార్యనిమగ్నత), సమాధి (మనస్సు బ్రహ్మముద్రలో మునుగఁ జీవాత్మ పరమాత్మతో నైక్యమగుస్థితి) అను అష్టఅంగములు గలవు. 'యమ' ఆచణార్థము, సత్యవాక్యపరిపాలన, అహింస, అనపహరణ, కామిని కాంచనములపై రాగరాహిత్యము అవసరము. 'నియమము'కొరకు సంతుష్టి, ఇంద్రియముల నిలకడ, నిశ్శబ్దమననము, కాయపరిశుభ్రత, నిష్కామకర్మానుచరణము అలవరచుకొనవలెను. శరీరమును 'యోగాసనము'న నుంచినయెడల యమనియమాదులు సులభ్యములు. అప్పుడే 'ప్రాణయామము' కూడ నుసాధ్యము. మనస్సామర్థ్యమున నావెనుక 'ఇంద్రియనిగ్రహము'ను సాధించవలసియుండును. ఆపైన 'ధారణ'వలన మనోనిశ్చలత్వ మలవడును. ఆవెనుక 'ధ్యానము'వలన జ్ఞాత (చిత్రించువాడు), జ్ఞాన (మనస్సు), జ్ఞేయము (చిత్రింపబడునది) యీ మూడును నొక్కటై, యోగి 'సమాధి'లో మునిగిపోవును. ఈస్థితిలో యోగి మానవాతీతములగు శరీరమానసికశక్తులను బడయును; దీనినే 'సంయమము' అందురు; తద్వారా "అహంబ్రహ్మాస్మి" అను వేదవాక్యసారమును చవిగొనును—అని పతంజలి మహాశయుఁడు రాజయోగపద్ధతిని చెప్పెను. "అస్తి నాస్తి" (ఉన్నది, లేదు) అన్న బుద్ధుని తీర్మానము దీనివలన వచ్చినదే. ఇది సామాన్యమానవుల కలభ్యమగు 'మనోమాయి' (మనోరాహిత్య) విద్య. రామకృష్ణపరమహంసవారు దీనిరహస్యము నిట్లు జెప్పిరి: "'నేను ఉన్నాను' అనెడి అహంభావము నశించిన నాడే తాను పరమాత్మలో నొక యంశమని గ్రహించును; లేదా 'నేను' నశింపకున్నచో తానే సర్వస్వమునైనట్లుగ యెరింగికొనును." దీనిని సాధించిన యోగులు అవాంఛితముగ అసమానములగు (అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, వశిత్వం, యీశత్వం) అష్టసిద్ధుల నందగలరు.

మహాపురుషులు, పతివ్రతామతల్లులుగూడ నిట్టి ప్రతిభాసమన్వితులే. అందువలననే వారల దీవనలు, శాపములు, పలుకులు అమోఘములు; సంకల్పమాత్రమున వార లెంతటి ఘనకార్యమైనను సాధించగలరు.

"ఈ అనంతవిశ్వములో మానవశరీరము నుబోలు మహత్తరవస్తు వింకొకటి గానరాదు; ఆశరీరమందు మనస్సునుబోలు అపూర్వవస్తు వింకొకటిలేదు. ఆమనస్సున నుద్భవించు 'ప్రేమ' అన్నిటికన్నను ఉత్కృష్టమైనది; ఆ నిర్మల, నిశ్చల, అద్వితీయ, అనన్యప్రేమయే పరమాత్మ!" ఇది మనకెల్లరకు నిత్యమననీయమైన విషయము. అట్టిప్రేమ నలవరచుకొన గలిగినవాడు యోగీశ్వరేశ్వరుఁడు! ఏ యోగాభ్యాసమయు నక్కరలేకయే వానికి సర్వము కరతలామకమై పోవును. ఏలన విశ్వమందలి సర్వచరాచర వస్తుకోటియు ప్రేమజన్యములు. మాతాపితలు ప్రత్యక్ష

ప్రేమస్వరూపులు. సతీసుతులు, సోదరీసోదరులు, బంధుమిత్రాదులు, జంతుజాలము, సర్వము ప్రేమ బంధనకు లోనైనవే; ప్రేమవలన నావిర్భూతము లైనవే. ప్రేమచే సాధింపరాని దెద్దియును లేదు. బుద్ధదేవుడు భూతదయచే గరిగిపోయిన ప్రేమరాశి; టాగూరు విశ్వమానవసౌభ్రాత్రమునకు విశ్వమానవ ప్రేమకు పాటుబడు పుణ్యపురుషుడు; పూజ్యుడు. గాంధిమహాశయుడు యీ ప్రేమసూత్రమునే ధరించి, ప్రేమధనస్సు చేబూని, ప్రేమతో లీలావిహారము సల్పుచున్న యుగపురుషుడే. ఈ మహాత్ముని పల్కులు లోకకల్యాణమునకు దారిజూపుచున్నవి; పద్ధతులు జగత్తునకంతకును మార్గదర్శకములు, ఆదర్శకపూర్వకములునై-అగుచున్నవి-ఇంకను భావిప్రపంచమునకు కాబోవుచున్నవి. సృష్టి పరాత్పరుని ప్రియపుత్రిక. "ప్రేమమున లోకముదయించెనేమొ! లేక ప్రేమయే లోకమున బుట్టనేమొ!! ప్రేమమయుం డీశ్వరుడు!—జగత్ప్రేమమయము!!" అని పాడిన కవిసార్వభౌము లెంతయు వందనీయులు!

ఈ మానవజీవితము నెందుకై యెత్తితిమి? దీన సాధించవలసిన కార్యమేమి? జీవితము నిట్లు గడిపిన యెడల మనకును ఇతర జంతువులకును వ్యత్యాసమేమి? యీ ధనార్జనే, విద్యాసముపార్జన యివన్నియు నెందుకై పెద్ద లేర్పరచియుండిరి? జ్ఞానులు-మన శక్తిని గుర్తించి, విజ్ఞానదృష్టితో నీ యనంతవిశ్వ ప్రదర్శనను తిలకించి, సృష్టికర్త నెఱింగికొని, వానితో నైక్యమగుటచే 'జన్మరాహిత్యము'గను, 'ముక్తి'గను దెల్పుచుందురే—దాని యర్థమేమి? నిత్యానంద సుఖశాంతు లెట్లు లభ్యములు?"

తామరాకుపైనుండు నీటిబిందువువలె నిహ విషయములలో దిరుగుచున్నను వాటిలో తన మనస్సు చొరనీయక కాలముగడుపుట విజ్ఞానమందురు. తన్ను నిమిత్తమాత్రుడుగ, దైవముచేతి తోలుబొమ్మగా నెఱింగికొని సర్వస్వము నీశ్వరార్పణగావించి, వాని ప్రేరణప్రకారము ప్రకృతికార్యముల నిర్వర్తింపుచు, నిష్కామకర్మాచరణము, రాగరాహిత్యము మున్నగువాని నలవరచుకొనుట జ్ఞానోదయమునకు మూలసూత్రములు. కోరిక, సుఖవాంఛ యివియుండుట జ్ఞానప్రతిబంధకములు. ఇది శ్రీకృష్ణభగవానుని దివ్యగానము.

"'నీవు నిమిత్తమాత్రముగ నిల్వుము, సర్వము
సిద్ధమం'చు నా
నావిధ వాసనల్ తొలగ నవ్యతరోక్తుల
గృష్ణుడ దర్జునున్
గావగ సర్వమున్ దెలిపెగాదె; వివేక
మొకింతగలైనా
జీవులకిద్ది చాలదొకొ శ్రేయముగూర్పగ
శ్రీకుడేర్పగన్."

అని గీతాసారమును అతిహృదయంగమముగ రచించి ఒక ఆధునికవిదుషీమణి ప్రబోధించియున్నది.

సర్వమునకు మూలకారణము ఒక్కటియేయని, అదియే 'ఆత్మ' యని గుర్తించుట జ్ఞానోదయ చిహ్నము. "ఆత్మవత్సర్వభూతాని" అన్నది చిన్న వాక్యమేయైనను అందు అనంతార్థము ఇమిడియున్నది. "హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు సంశయము పనిలేదా, హరిమయము గాని ద్రవ్యము పరమాణువులేదు........." అని భాగవతసూక్తి.

ఈ బాహ్యవిశ్వమునంతటిని పంచేంద్రియముల ద్వారా నెఱింగికొనునది మనస్సు. మనస్సు అపూర్వమైనది; అనంతశక్తియుతమైనది. అది లోదృష్టిలో నిమగ్నమైయుండెనా ముకుళించిన మొగ్గవంటిది; వికసించి ప్రఫుల్లతజెందెనా-సర్వసచరాచర వస్తుజాల సమన్వితమై సూర్యచంద్రగ్రహతారాదులతో నిండిన అనంతవిశ్వమునంతను గ్రాహ్యమొనర్చుకొనుచు తనలోనిమిడ్చికొనగల సామర్థ్యము గలది. ఇంకను వివేకదృష్టితో జూడగలిగినా "అహం బ్రహ్మాస్మి"

అని అనగలది; తానుండుటవలననే జగత్తున్నదని నిర్దేశించగలది. మనస్సున కంతేని సామర్థ్యమున్నది. పరమభాగవతోత్తముఁడైన ప్రహ్లాదుఁడు "సర్వార్థములు మనస్సంభవములు" అని చిననాడే గుర్తించ గలిగెను. మనస్సుండుటవలననే జగత్తున్నది; ఐనను జగత్తుండుటచే మనస్సున్నదనుటకు వీలులేదు. ఏలయన సమాధిలోనున్న యోగి మనస్సునకు జగత్తను బాహ్యవస్తు వొకటియున్నదని యెఱుకయేయుండదు. అట్టిస్థితిలో జగములేకున్నను మనస్సుమాత్రమున్నది. అది యింద్రియాదిష్టము గాక లోన నివసించుచునేయున్నది; సమాధివిడచి మరల యింద్రియములలో అది ప్రవేశించినప్పుడే విశ్వరూపేణా పరిణమించుచున్నది. ఇట్లు మనస్సు సమాధిలోనున్నతఱిఁ– శరీరము, మెదడు, మనస్సు వీటన్నిటికి నితరమైన వస్తు వింకొకటి (దాని నే పేరున బిల్చినను బిల్వుడు) సర్వసాక్షియై యన్నిటిని గనుచునేయున్నది. మనస్సునకు మరల నింద్రియలోలతగలిగి ప్రపంచము నెఱింగికొనగల సామర్థ్యముగూడ దానివలననే గలుగుచున్నది. అద్దానికి 'కాలము, పరిణామము, కారణ కార్య కర్తృత్వాదులు' లేవు. కాలాతీతమైనది గనుక యది 'సత్' స్వరూపము, నిత్యము, ఆదిమధ్యాంతరహితమై జననమరణాదుల కతీతమైనది. పరిణామమును మీరినది గాన నది సర్వవ్యాపి, సర్వసాక్షి. కారణకార్య కర్తృత్వాదులను మించినది గాన నది నిశ్చలము, నిర్వికల్పము, సత్ స్వరూప-స్వప్రకాశ–జ్యోతిర్మయ–శుద్ధానంద బోధ స్వరూపమైనది. ఇట్టి నిత్య సత్య సర్వాత్మకమైనదియే బ్రహ్మము, 'సచ్చిదానందము' (సత్–ఆదిమధ్యాంత రహితము, చిత్–స్వప్రకాశము, ఆనందము–అవ్యయానందము). కాన ఉన్నదొక్కటియే; ఉన్నవాఁడా 'పురాణపురుషుఁడే'. తరంగములు వేరుగ గాన్పించుచున్నను అన్నిటనుండునది నీరమే. దీనినే భిన్నత్వములో నేకత్వముగాంచుట యందురు. ఎంచి జూడఁ జగత్తునకు నిజమగు యునికిలేదు; అది కేవలము మనోనిర్మితము, మాయాత్మకమైన ప్రకృతియంతయు సర్వాంతర్యామియగు వాని లీల. ఈ సర్వ సచరాచరవస్తుకోటియు ఆ "సచ్చిదానంద స్వరూపము"లో దోచు బుద్బుదమాత్రములు. అవి క్షణకాలముమనుచు అందే లయమయిపోవుచు బాహ్యమునఁ జగత్తు అను వ్యామోహమును గల్పించుచున్నవి. అందులకే వేదాంతవిదులు యీప్రకృతిని లేక మాయను లేక విశ్వమును 'అనాది' (మొదలు మధ్యము అంతములేని దాని)గా దెల్పియుండిరి.

మూలప్రకృతి లేక మాయ పరాత్పరుని చిచ్ఛక్తినుండి త్రిగుణాత్మకమైన (సత్–సాత్వికశక్తి, రాజస–సృష్టికి కారణమగు శక్తి, తామస–వినాశకారిణియగు శక్తి) వీటి కలయికగల, 'మహత్తు' పుట్టినదనియు, వీటిలో తామసగుణ మెక్కుడగుడు మహత్తునుండి 'అహంకారము' ('నా', 'నేను' అను బుద్ధి) జనించినదనియు వేదాంతులు దెల్పెదరు. అహంకారమునుండి 'పంచ తన్మాత్ర'లగు శబ్ద (చప్పుడు), స్పర్శ (తాకుడు), రూప (ఆకారము), రస (ద్రవత్వము), గంధ (ఘనత్వము) ఉత్పత్తిజెందినవి. వీటివలన 'పంచభూతములు'—ఆకాశము (ప్రదేశము), వాయు (గాలి), అగ్ని (వేడిమి, వెలుగు), అపః (నీరు), పృథ్వి (భూమి) జనించినవి. ఈ పంచభూతములే సర్వజగత్తునకును–చరాచర జంతువస్తుజాలమునకు, దృశ్యాదృశ్య ప్రపంచకమునకు–మూలవస్తువులై మన మెఱిగెడి విశ్వముగ పరిణమించి అద్భుతాహ్లాదమును గొల్పుచున్నది.

సత్వగుణములో సగపాలున 'జ్ఞానేంద్రియము'లగు త్వక్ (స్పర్శజ్ఞానము), చక్షు (దృష్టి), శ్రోత్ర (వినుట), జిహ్వ (రుచి), ఘ్రాణ (వాసనచూచు) పంచేంద్రియములును, తక్కిన సగపాలువలన 'అంతఃకరణము'ను బుట్టినవి. అంతఃకరణ–తాను సల్పు క్రియలనుబట్టి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకా



చంద్రుని చిత్రాలు



రము అన బరగుచుండును. (ఆలోచనానిమగ్నమైన అంతఃకరణమే 'మనస్సు'; యుక్తాయుక్త నిర్దేశమును సల్పు అంతఃకరణమే 'చిత్తము'; ఎద్దానినైన నిశ్చయించుచున్నపుడు అది 'బుద్ధి'; నా, నేను అని బల్కుచున్నతరి గల 'అహంకారము'గూడ అంతఃకరణమే.

రాజసగుణములో షగపాలువలన 'కర్మేంద్రియము'లగు వాక్ (వాక్ప్రవృత్తి), వాణి (యిచ్చి పుచ్చుకొనుట), పాద (నడచుట), పాయు (కష్టించుట), ఉపస్థ (కోరుట)లును, మిగత అర్ధమువలన 'ప్రాణవాయువు'ను జనించినవి. ఈ ప్రాణవాయువు మరినాల్గు రూపముల చరించుచుండును:-ఉచ్ఛ్వాస నిశ్వాసలు సల్పునది 'ప్రాణవాయువు'; దుర్గంధముల వెడల నడచునది 'అపానవాయువు'; మూత్రకోశము, ప్రేగులు వీటిని యుక్తకాలముల శుద్ధిపరచునది 'వ్యానవాయువు'; మాట్లాడుశక్తి నిచ్చునది 'ఉదానవాయువు'; జఠరకోశములందలి యాహారమును జీర్ణింపజేసి దాని సారమును డెబ్బదిరెండువేల రక్తనాళములలోనికి నుచితరీతిని బంపించునది 'శమనవాయువు.'

మన భౌతిక 'స్థూలశరీరము' ఈక్రింది తత్వముల సమ్మేళనమువలన నేర్పడినది:—ఐదు జ్ఞానేంద్రియములు (త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు), ఐదు (పంచ)భూతములు (గగనానిలవహ్నిసలిలధరలు), ఐదు కర్మేంద్రియములు (వాక్పాణి పాద పాయూపస్థములు), పంచవాయువులు (ప్రాణ అపాన వ్యాన ఉదానశమన వాయువులు), అంతఃకరణము దాని నాల్గు ఇతరరూపములును (మనో బుద్ధి చిత్తాహంకారములు). ఇది మానవశరీర నిర్మాణరీతి. తిని జీర్ణించుకొనిన ఆహారముచే పెరిగి స్త్రీపురుష లింగ భేదములతో వర్తించు నీశరీరము 'అన్నమయ కోశము' అనిగూడ బిలువబడుచున్నది.

ఇంకొకటి అవినాశియగు 'సూక్ష్మశరీరము'గూడ పంచభూత, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, ప్రాణవాయు అంతఃకరణాదుల సమన్వితమైనదియే; అది యింకను 'ప్రాణమయ', 'మనోమయ', 'విజ్ఞానమయ' కోశములనుండి యుద్భవిల్లినదిగూడ అగుచున్నది. (ప్రాణవాయువు, కర్మేంద్రియములు కలసినది ప్రాణమయకోశమందురు; మనస్సు, జ్ఞానేంద్రియములు కలసినది మనోమయకోశము; బుద్ధి విజ్ఞానమయ కోశము.)

మూడవది 'కారణశరీరము' (కారణ-జగదుత్పత్తికి కారణమగు శక్తి, శరీరము-దేహము). దీనిని "అవిద్య", లేక "మూలప్రకృతి", లేక "మాయ" అందురు. 'ఆనందమయకోశ'మన్నను నిదియే.

స్థూల సూక్ష్మ కారణ శరీరముల సమ్మేళనమైనది 'ఆత్మ'కు నిలయమగుచున్నది. సాధారణముగ మనము "చావు" అనుకొనునది స్థూలశరీరము (అన్నమయకోశము)యొక్క వినాశమని యిప్పు డెరింగికొనసగును. అందుండు 'జీవాత్మ' అనగా ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములు కలసియైన సూక్ష్మశరీరము. గత శరీరము సల్పిన సత్కర్మ దుష్కర్మములకు పరాత్పరుని సముఖమున జవాబు దారియగుచు తదుపరి తత్ఫలముల ననుభవించుటకునై మరల కర్మఫలమున కనుగుణ్యమగు స్థూలశరీరమును తాల్చుచు, పుట్టుచు మరల గిట్టుచునుండును.

"ముక్తి", లేక "జన్మరాహిత్యము" అన పై మూడు శరీరములనుండి విముక్తినందుటయే; అవి యన్నియు వినాశము కావలెను. అప్పుడే జీవాత్మ-పరమాత్మలో నైక్యమగుచున్నది. అట్లు లయమందిన వెనుక మరల జననమరణాదుల భీతియే లేదు. ఇక నొకటే ఆనందము! నిత్యానందము!! నిత్యశాంతి!!! దీనిని బొందుటయే మానవజీవితపు ముఖ్యకర్తవ్యము, పరమావధియునైయున్నది.

# ప్రజాహితులు కాని పెట్టుబడిదారులు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

పూర్వాపర సందర్భము లాలోచించి చూస్తే లలితచిత్రకళావంతమును భక్తికను కూలమును, సోమరితనమును పారద్రోలి కాయకష్టమును గల్గించి తద్వారా శరీరారోగ్యభాగ్యమును గల్గించి కొద్దిదో గొప్పదో ధనార్జనాసాధక మూలంబును నగు చేతి విద్య లడుగంటుటయే లోక వినాశసూచకము. ఈ కీలకమును ఆకర్షించియే ధనవంతుడొక పెట్టుబడిదారిదై ఒక్కొక్క వ్యాపారపు సంస్థస్థాపించి అస్వాతంత్ర్యప్రజల కూడపడగొట్టి విదేశపు మిల్లు రహస్యముల గ్రహించి వందమందికి వృత్తులిచ్చెడు యొకేపని నొక్క మిషను సహాయమున చలాయించి ప్రజలకు సుఖవనే ఎర గల్పించి శ్రమేపి చేత కాని వారినిగా తయారుచేసి తానొక్కడే ధనవంతుడగుచున్నాడు.

ఒక పొలమొక ఆసామీకున్నది. స్వంత వ్యవసాయము చేయించుపట్ల పొలము దున్నుటకు విత్తనాలు జల్లుటకు మొలచినవి నాటుటకు నాటుకొని ఎదిగి ఫలించిన చేలు కోసి కుప్పవేసి నూర్చుటకు ఎందరు కూలీల సహాయమవసరమో ఆలోచించండి. తన కుపచరించిన కూలీలకందరకు ఏరోజుకూ లారోజిచ్చి ఎంతమంది కన్నాదరువు కల్గించుచున్నాడో యోచించండి.

ఇక మిల్లుదారుడో కూలీలసహాయ మక్కర లేకనే విదేశాన్నుండి యొకదున్నే మర నీళ్లుజల్లేమర కోసేసేమర తెప్పించి ఇద్దరుముగ్గుర సహాయంతో వ్యవసాయం చేయించి డబ్బు మూటగట్టుకొంటున్నాడు. ఇక ధాన్యము బియ్యమగుటకు మర సహాయము లేనప్పు డింటింటా దంపులే అధమం నల్లురైదుగురు ధాన్యందంపి సాయంకాల మయేసరికిన్ని బియ్యము నూకలు పట్టుకెళ్లి కడుపునిండా పిల్లామేకా ఇంతన్నము తినేవారు. పగలెల్ల కష్టపడుటచే శరీరారోగ్యముండెడిది. పైగా తినేది దంపుడుబియ్యమన్నమగుటచే సారాహారము జీవధాతువుల వృద్ధి (విటమిన్సు)కలిగి రోగములపాలుకాక చిరాయుష్మంతులై వుండేవారు.

ఇప్పుడో ధాన్యపు మరవుందంటే ఒక్కసారిగా పుట్లాదిధాన్యము బియ్యమగు నన్నివర్తకుడును,దంపుళ్లవాళ్లతో బాధపడ లేమని గృహస్తులుకూడ ఆరోగ్యభాగ్యసూత్రములు మరచి త్వరలో పని తెములుననే భావమునకు తెలుపు వర్ణ వ్యామోహానికి లోబడి మర్లతమపనులు కావించుకొని పొందేఫలిత మేమి? తవుడు పూర్తిగా తీయబడి తెల్లదనము కల్గించుబియ్యము కడుగుటచే కొంత తవుడు పోవుట, అన్నమువండి వార్చివేయుటచే గంజి రూపముగా ఉన్నరవంతసారము

గూడపోయి మిగిలినపిప్పి తినుటచే ఉబ్బు రోగాలు అజీర్తిలు, చులుకులు, మొదలైన వ్యాధులకు పాల్పడుట పదుగురు కూలీలను బ్రతికించే డబ్బుయొక్క మిల్లు ఆసామీకే యిచ్చి వానినే అందరుకలసి ధనవంతుని జేయుటయు కలుగుచున్నది.

ఇట్టి వనేక అంశములు. లగ్గసర్లలో పెళ్లి పనుల కథమము నెలరోజు లవిచ్ఛన్నముగా పాటకపుజాతికి పనులుండేవి. ఊరగాయ రోజులలో యిప్పటికి నాల్గుమాసములు కూలి జనానికి భుక్తికి వృత్తికలదు. కాని పిండి మరలొచ్చి సాలుకొకసారి కల్గించే కారాలదంపుల కూలికూడా పడగొట్టాయి. "సుఖం మరిగితే నూద్రకూడ"న్న సామెతానుసారముగా గృహిణి సాధ్యమైనంత వరకు డబ్బుపారేసి సమస్తపనులు,చేయించుకొని సోమరియై అజీర్ణాదిరోగాలపాలుబడి దానిచే రక్తముచెడి శ్వాసకాసక్షయాది ఘోరవ్యాధుల పాల్బడి అకాలమృత్యువు కాహుతియగు యవస్థ లధికమగుచున్నవి.

చంటిపిల్ల చొక్కాయైనా కుట్టుకొనుటకు బద్ధకము. అణాకూలిచ్చి మిషనుమీదికి పంపడమే. కాఫీగింజలపొడికిమర. అప్పడాల పిండికిమర.వంటలకుగ్యాసుష్టవులు.దీపాలలో చమురైనా పోసుకొనే పనిలేకుండా ఎలక్ట్రిక్కుదీపాలు; శరీరపరిశ్రమగా నీళ్లయినా నూతినుండి తోడుకోకుండా కుళాయిలు. పండగలకు గడపలకు పసుపుకుంకాలైనా పెట్టుకొనే లక్షణములేకుండా లక్కరంగు పూతలు. ఇళ్లు అలుక్కునే బాధలేకుండా గచ్చులు, పూజాదికప్రయాసనీమాలుపడకుండా బెడ్ కాఫీలు. ఒకటేమిటి గృహిణీలోకానికి సుఖమింతఅంతకాదు. ఇట్టి అనారోగ్యసౌఖ్యాలు మరిగినకాంత కాలుకదపలేదు. దానితో ఉదరాలుపెరిగి ఏనుగుగున్నల్లాగ తయారై ఆయాసపడుతూ అసలే పని మట్టులేక బాధలు పొందువారెందరో కలరు. పనిముట్టుట నామర్దాగా ప్రస్తుత సంపూర్తి విద్యార్థికులు తలంచి మరింత భ్రష్టులగుచున్నారు. అందుకనే స్త్రీవిద్యావిధానము మార్చాలని పెద్దలంటున్నారు.

పోనీ ఇన్నిసుఖాలు వచ్చాయని రాట్నపరిశ్రమయైనాచేసి స్వంతనూలుతో స్వంత బట్టలు నేయించుకుని పరదేశానికి పంపే ధనము నాదాయపరచినా బాగుండును. దానికి బద్ధకమే.ఇన్నివిధాల నిరుపయోగంగా మన బ్రతుకులున్నప్పుడు నిరుద్యోగం దేశదారిద్ర్యంకాక లక్ష్మినిలయం ఎట్లగును?

ఇన్ని విషయాలలో వెనుకగా మనముండే అవకాశమే పురస్కరించుకొని పెట్టుబడిదారుడు మరింత ఆశావంతుడై విజృంభించుచున్నాడు. "సోషలిజ"మని మన వాళ్లను ఇతర కంట్రీలు కొన్నియు ప్రాకులాడుట పెట్టుబడిదారుల స్వార్థపరత్వాన్ని అణగద్రొక్కుటకే యని గ్రహించండి.

రష్యాయందు ప్రస్తుతము సోషలిజము. అంటే సర్వసమానత్వము, సమసోదరత్వము, స్వార్థత్యాగము.ఆమధ్య వారిదేశాల్లోఫంక్షు

చితక పండితే దేశంలోవున్న బీదసాదలం దరికి తృప్తిగాతిని అనుభవించేలాగ పంచి పెట్టేరట. అది ఎంత మంచిగుణము? ఎంత భూతదయాపరత్వము తెల్పుచున్నది!! అల్లాంటివే యూరపు దేశంలో కొన్ని రాజ్యాలలో, పెట్టుబడిదారుల ఆశాగ్నికీలలకు ఎక్కువగాపండిన కాఫీగింజలు ధ్వంసము చేయబడినవట. ఒకచో గోసమృద్ధికలిగి పాలు వృద్ధిగావుంటే అలోమని ప్రక్కను బీద శిశువులాక్రందనము సేయుచున్నను చౌకగా అమ్మవలసివచ్చుననే ఆశాపిశాచబాధితులై పాలన్నీ సముద్రంలో పారబోసారట. ఆహా! ఎంతటి అవినీతియో ఆలోచించండి.

రష్యాకు పై దారుణ పెట్టుబడిదారుల ప్రవర్తనకు భగవంతుకుకాని ప్రజలుకాని ఎవర్ని మెత్తురు? అనేకసంవత్సరాలగా లాభాధిక మనుభవిస్తున్న వ్యాపారస్తుడొక యేడు నష్టమొందిన కష్టమేమి? ఇట్టి దురాశాపాశమే ప్రజాహితముచెరచి లోకాన్ని నింధన మొనర్చుచున్నది. ఎవరికి వారికే ఆశ.

స్వార్థపరత్వుడు తన వస్తుసముదాయం పాడైనా హర్షిస్తాడు కాని తోడిసోదర లోకముయొక్క తృప్తికి వినియోగించడు కదా? ఉద్యోగస్తుల గృహిణిలు కొందరు తమకులం చాల గావచ్చిన పండ్లుపగ్గి రాల తిను బండారములను తమ్మనుసరించుకొని గడగడలాడుచూ ఉదయాస్తమయములు పరిచర్యచేయు నౌకరుల కించుకంతైన పెట్టక కుళ్లబెట్టి పారబోసేవారి నెందరినో చూచియుంటిని. ఇట్లే ప్రపంచకమంతా దురాశాపరత్వంచే చుట్టబడినన్నాళ్లు భూతదయానసమసోదరత్వముకలుగ నంతవరకు మనదేశమున పెద్దమ్మ తాండవించుట నిజము. సోమరితనము వృద్ధగుట తప్పదు. చేతివిద్యలు నశించుట నిక్కము. గాన మనవారిది గుర్తెరిగి పెట్టుబడుదారుల కవకాశము లేకుండా పూర్వమువలె చేతివిద్యల నాదరించి నిలబెట్టుకొని నేర్చి వ్యర్థకాలక్షేపములచే పరదేశాలకి పంపే ధనప్రవాహ మరికట్టి వెనుకకు ద్రిప్పుకొని సకలవస్తు సమృద్ధియు సస్యసమృద్ధియు, కలియుగ దైవావతారము మహాత్ముని సాత్వికసంపన్న మాదర్శముగానుంచుకొని సౌఖ్యవంతముగా బ్రతుకుదుముగాక.



# గుణవతి

(పంచమదశము)

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

'నిజమరి మెఱుంగడే యన్య సతిగరిమ'

గీ. ఇట్లు చెలిపల్కులకు మోద మెసయమతిని దైవమును నమ్మి విద్యావిధాన మెఱిగి
కంటికిని రెప్పవలె సఖిఁగాచుచుండ సఖికి మైనీడయై తాను జరుగుచుండ.

క. ఆటలపాటల తేనియతేటలపస నవ్వజాలు తియ్యదనములా
మాటలదనువుచు బాలలపాటవమున వారి మనసుబడసె గ్రమమునన్.

క. చదువగ వ్రాయగ బాడగ ముదముగ గథలల్ల గ్రంథముల భావంబున్
విదితముగ నెఱిగి బలుకగ వదలక బాలికలకెల్ల వరుసగ నేర్పెన్.

గీ. అల్లుటయు కుట్టుటయు రంగవల్లులెన్నొ దీర్చుటయు నూలువడుకుట నేర్చినన్ని
నేర్పె చెలికడ తానెన్నొ నేర్చికొనుచు బాలికల కొజ్జచెలి వెలిప్రాణమగుచు.

క. తలలో నాలుకవలెదా బలువురమది బిడ్డవోలె భావింపగ రం
జిలుచుం గాలము ద్రోయుచు మెలకువమర్యాదగలిగి మెలగుచునుండన్.

క. కూరలు గాయలు పండ్లును తీరగుపలుధాన్యములును తీయని పెరుగుం
గారవమున నిడి యామెను కూరిమి బాలికలు సతముఁ గొలుచుచునుండన్.

క. ఈపగిదినేగఁ గాలము పాపాత్ములు కొందఱికిది పరికింపంగా
జూపోపకుండెనెద పరితాపమొదవె నుందురు పరతాపదులెందున్.

గీ. దుష్టపురుషులు కొందఱు ద్రోహమతిని పెట్టరానట్టి యిడుముల బెట్టిరామె
నాడరానట్టిమాటల నాడినారు చేయగూడని యత్నముల్ చేసినారు.

సీ. దారినేగుచునుండఁ దా డాసి చనుదెంచి చప్పటుల్వెనువెంట జఱచినారు
మొట్టులైననుగాని రట్టుజేతముబట్టి యీచారుమతినంచు నెంచినారు
మతినెన్నగా మానవతి యీమె యానాయటంచు లోకంటగించినారు.
తలుపులుగొట్టుచు కలకలనవ్వుచు నింటిపై రాల్పడవేసినారు
పనియేమిలేకయే పల్కరించుచు పల్కకున్న తిట్టుచుపోవుచుండినారు

గీ. అపహసించుచు వెడమాటలాడువారు నట్టిఁబలుపోకలనుబోయి తుట్టతుదకు
చట్టువలెచలనములేని చారుమతిని యేమిసేయుటకును మార్గ మెఱుగలేక

క. తమలోతమ రాలోచన మమరంగా జేసి యప్పుడప్పుడొకడుగా
విమలాంబపతిని గని వినయము దోప నమస్కరించి యతిభక్తిమెయిన్.

గీ. అయ్య యీయూరనుంటి రిన్నాళ్లనుంచి మీరలోకమాటబడకుండ గౌరవముగ
క్రొత్తయాబిడవచ్చిన కొన్నినాళ్లనుంచి జరిగెడు చిత్రము లెంచలేము.

గీ. ఏటికీపీడ మీకుమీయింటిలోన నున్నగలుగు నపాయములెన్నొగాన
నిచ్చవచ్చినచోటికి నేగునామె సాగద్రోలుడు మీరింక జాగుమాని.

గీ. అయ్య మీయామె మంచిదైయైనగాని చెడుగువాటిల్లు క్రొత్తామె చెలిమిననిన
నేమిపలుకగ తోచకొకింతతడవునిలిచి వసతికరిగి శయనించివగచె.

గీ. విమలమతి నాడుఇల్లాలు విమల యిట్టులకట యపనిందలెన్నొ మోయంగవలసె
యనుచు వగజెందెనతడు నెమ్మనములోన తనసతీమణి సుగుణముల్ తానెఱుగుట.

గీ. తెలియు క్రొత్తామె సద్గుణకలితమనుచు మంచిచెడు లొక్కగడయైన మాటువడున
నిజముదెలియగనేరరు నీచమతులు నిజమరిమెఱుంగడే యన్య నీతిగరిమ.

# పుట్టుమచ్చ

**శ్రీమతి పైడి రేణుకాదేవిగారు**

పద్మిని వసారాలోకూర్చుని, లేసల్లుకుంటూంది. సీతాసుశీల పుస్తకములోచూస్తూ యేకకంఠములో మంగళహారతి పాడుకున్నారు.

గుమ్మములో బూట్లుచప్పుడు వినిపించింది. గుఱ్ఱపు డెక్కలమాదిరి. "టక్ టక్"మని బూట్లతో శబ్దము చేస్తూ విజయకుమార్ వసారాలోంచి యింట్లోకి పోయాడు. పద్మిని లేసుసామానంత పెట్టెలోకి సర్దివేసింది. సుశీల సీత పరికిణీలు దులుపుకుంటూ పరుగెత్తారు.

విజయకుమార్ కోటువిప్పి హేంగరుకుతగిలించి చొక్కాకుడిచేతిని పైకిలాగుకుని డబ్బాలోని సిగ రెట్టును పైకితీసి వెలిగించి యీజీచైరులో కూలబడ్డాడు. పద్మిని నెమ్మదిగా కుర్చీవెనుక నిలబడింది. విజయకుమార్ మొఖములోనికి తొంగిచూసింది. నిప్పుకణాలవంటి నేత్రాలు బీభత్సంగా కనిపించాయి. విషాదచంద్రికలు చిందులుత్రొక్కుతున్న పెదవులు భయంకరంగా చూపట్టాయి. విజయకుమార్ సిగరెట్టుపొగతో మేఘాలల్లుతూ పద్మినితో అన్నాడు: "నీవల్ల నాకు ఒక ఉపకారం జరగవలసి ఉంద"ని. పద్మిని నివ్వెరపోయి "—నావల్ల నా? మీకుపకారం చేసే అవకాశం నాకు లభించితే నిజముగా నేను ధన్యురా"—లంది వినయవిధేయతలు తొణుకుతూన్న కంఠంతో.

కుమార్:—(మోటుగా) నాకు యిప్పుడు కొంత ధనము కావలసిఉంది...తండ్రిగారిని...

పద్మిని:—(ఆశ్చర్యంతో) ధనం.

కుమార్:—(భయంకరముగా) అవును—ఆశ్చర్య మెందుకు?

పద్మిని:—నేను మీకు ధనసహాయం చేయగలిగి నంతే...

కుమార్:—(గుడ్లు మరింతయెఱ్ఱచేసి) భర్తమీద అభిమానంగలభార్య అడిగిందే చాలని తనవద్దనున్న ఆభరణములైనను యిచ్చితీరుతుంది.

పద్మిని:—ఆభరణములా?

కుమార్:—(రౌద్రమును కట్టించుచు) ఆశ్చర్యముగా వ్యాఖ్యానము చేస్తున్నావే? అవును—నా కిప్పుడు ధనముకావాలి. నీవంటిమీద వస్తువులైనా తీసియిచ్చితీరాలి.

పద్మిని గొంతుక సవరించుకొని యేమో అన బోతూండగానే కుమార్ పద్మినిచెయ్యిపట్టుకు మెడలోనున్న గొలుసును ఊడదెరక ప్రయత్నించాడు, అంతట్లోనే అన్నపూర్ణ, కుమార్ తల్లి, అగదిలో ప్రవేశించింది. యీదృశ్యముచూసి నివ్వెరపోయింది. కుమార్ దుష్టచర్యలకు మనస్సులో వగచింది.

కుమార్ పద్మినిని బూటుకాలితో తన్ని కోటును బుజానికితగిలించుకుని గుమ్మందిగాడు. అన్నపూర్ణ కుమార్‌ను ఆప ప్రయత్నించింది. విసిరిపుచ్చి ఆమెను గెంటి మెట్లుదిగాడు.

౨

రాత్రి పదకొండు కావస్తూంది. ప్రకృతికంతా వెల్లవేసినట్లు వెన్నెలకాస్తూంది.

పద్మిని భగవద్గీత పంద్రెండో అధ్యాయమువరకు చదివి పుస్తకాన్నిమడిచి బల్లమీదపెట్టి దీపంతగ్గించింది. వెన్నెల మొఖంమీద పాకుతోంది. పద్మిని చంద్రబింబమువంకచూస్తూ హృదయవేదన తలచుకుంటూంది. తన భావిజీవితమునుగూర్చి ఆలోచనా అలలే ఆహృదయసాగరంలో పరంపరలుగా పొంగి పొరలుపోతున్నవి. ఆవేదనతో అలసిపోయిన హృదయానికి కళ్లు మూతలుపడ్డాయి.

నిద్రలో...యెవరో కిటికీకి వున్న అద్దం బద్దలుకొట్టి లోన ప్రవేశిస్తున్న సవ్వడి వినిపించింది. పద్మినికి. మెల్లగా కళ్లువిప్పింది. కిటికీలోనుంచి ఒక వ్యక్తి తనవేపుకు వస్తూఉన్నట్లు తోచింది. కళ్లు నులుపుకుంటూ దీర్ఘంగా చూచింది. విజయకుమార్. అమిత మద్యపానంవల్ల కళ్లు చింతనిప్పులుమాదిరి వెలుగును జిమ్ముతున్నయి ఆచీకటిలో. పద్మిని లేచింది, నెమ్మదైన బొంగురుగొంతుకతో 'పద్మినీ'– అని పిలిచినట్లు వినిపించింది, పద్మిని ముందుకు సాగింది. తిరిగి అదేగొంతుకతో—"పద్మినీ! నాకు డబ్బు అత్యవసరము. తప్పనిసరిగా నీఆభరణ మొంక టిచ్చితీరాలి—లేదా—"

పద్మిని గద్గదస్వరముతో అంది—"మీరు యిట్టి దుష్ప్రవర్తనకలవడి......" గట్టిగా గద్దించాడు—"ఛండాలీ, నాదా దుష్ప్రవర్తన నీదా! కులటవు. భర్త లేకున్న నూ సంతోషముగా కాలము వెలిబుచ్చుచున్నావు—"

తలుపువద్ద కాళ్లచప్పుడైయింది. "అదుగో—యెవరో" అంటూ కుమార్ పద్మిని మెడలోనున్న గొలుసును త్రెంచి కిటికీవైపు పోయాడు. కిటికీ లోంచి క్రిందకు దూకాడు.

బైట తలుపుతెరవమని అరిచాడు కుమార్ తండ్రి హరిహరరావు. పద్మిని తలుపుతెరచింది. హరిహర రావు లోనప్రవేశించి పద్మినిని ప్రశ్నించాడు అనుమానాస్పదంగా—'మాటలు వినిపించాయి యెవరవి' అని. పద్మినికి యేమిచెప్పాలో తోచిందికాదు. గుండె పట్టినట్లయింది. యెంతప్రయత్నించినా అంటుకు పోయిన గొంతుకలోనుంచి ఒక్కక్షరంకూడ బయటకు జారిందికాదు. హరిహరరావు దీక్షగా ఆమెముఖ వర్చసు తిలకించాడు. ఖంగారు భయం కనిపించాయి. ఆముఖంలో ఖంఠంలోకిచూశాడు ఆభరణాలేమీ కనిపించలేదు. మరింతఆశ్చర్యముతో గద్దించిఅడిగాడు 'నీ మెడలో గొలుసుయేది?' పద్మిని సమాధానములేదు.

హరిహరరావు మేడపై గదిలోనికిపోయాడు. అన్నపూర్ణలేచింది. నెమ్మదిగా సంభాషణ వినిపిస్తూంది బయటకు. పద్మిని ఆగదివద్దకుపోయి వారిసంభాషణ విన్నది. ఆసంభాషణలో — 'యెవరో......నాకు నమ్మకంలేదు...పద్మినిది యింతవరకూ నిష్కళంక ప్రవర్తనయే అని తలచితిని...' —యీవాక్యాలు పద్మినిచెవులో పడ్డాయి.

వీధితలుపు చప్పుడైంది. హరిహరరావులేచి వీధి గుమ్మమువద్దకు పోయాడు. తలుపు తెరచేఉంది. పద్మిని గదిలోకిపోయాడు. పద్మిని కనిపించలేదు. పెరట్లోచూచాడు. పద్మినిలేదు. అన్నపూర్ణ నిర్మల కూడ లేచివచ్చారు. యిల్లంతా గాలించారు. పద్మిని జాడలే కనిపించలేదు.

3

రాత్రి పంద్రెండు కావస్తూంది—

చీకటిపడ్డది పెందలు హోరుల వర్షం ఆకాశం చిల్లులుపడ్డట్లు నిలిచి కురుస్తూంది.

విజయకుమార్ మోహిని బాబూరావు శంకరం చీట్లపేక ఆడుతున్నారు. బల్లమీద విజయకుమార్ కు యెడమచేతిప్రక్కగా ఉంచబడిన బ్రాందీసీసా లేవనెత్తి గ్లాసులోకివంచి అందరికీ అందిస్తున్నాడు కుమార్. అందరు ఒకరితరువాత ఒకరుత్రాగుతూ కేరింతాలుకొరుతూ చీట్లపేక సాగిస్తున్నారు.

తలుపు చప్పుడయింది—మోహినిలేచి—'యెవరబ్బా యింతవర్షములో వచ్చింది' అంటూ తలుపు వద్దకుపోయింది. తడచిన జీర్ణవస్త్రములతో పిచ్చి వాలకములో నున్న ఒకముష్టిది మెట్లమీదనిలబడి వణుకుతూంది. మోహిని తేలిపోతూన్నకళ్లతో చూస్తూ—'యిక్కడ నీకేం దొరుకదుపో' అనిగద్దించి చేతితో సౌజ్ఞచేసింది. ఆస్త్రీ దీనంగా హృదయాన్ని కరిగించేకంఠంతో—'తల్లీ! నాకు నాల్గురోజులనుంచి తిండిలేదు. ఆకలిబాధనైనా జయించాను కాని యీ చలిబాధను భరించలేకున్నాను. కొంచెము యీతలుపు

మూల పండుకోనివ్వండీ తల్లీ! మీకు మహాపుణ్యముంటుంది' అంది.

లోపలనుంచి—'నీది ఆట' అని శంకరం కేక వేశాడు. మోహిని 'మీరు ముగ్గురే ఆడుకోండి' అని గట్టిగా కేక వేసింది. లోపల పక్కున నవ్వారు. గ్లాసు రాతిమీదపడి ముక్కలైనచప్పుడు వినిపించింది. మోహిని తొందరగా పరుగెత్తింది. తిరిగి అయిదు నిమిషాలలో వచ్చింది. అంతవరకూ ఆ స్త్రీ వర్షంలోనే నిలబడిఉంది. మోహిని ఆ స్త్రీని లోపలికి రమ్మని 'అన్నంఉంది తింటావు' అని అడిగింది. జీర్ణ కంఠంతో — 'అంతకంటేనా తల్లీ' అంది ఆ స్త్రీ. మోహిని ఆ స్త్రీని వసారాలోనికి తీసుకువెళ్లి విస్తరిలో అన్నంపడ్డించింది. ఆ స్త్రీ అన్నంతింటూంది. మోహిని ఆ స్త్రీనే పరికిస్తూ కూర్చుంది. ఆముఖంలో పోషణలేక కుష్కించి జీర్ణిస్తున్న సహజసౌందర్యాన్ని పరికించింది మోహిని.

మోహిని:—అమ్మా నీకెవరు లేరూ?

ఆ స్త్రీ:—(సగం మూతలుపడుతూన్న కళ్లతో) లేదుతల్లీ యీప్రపంచములో నాకు నాఅన్నవాళ్లే లేరు.

మోహిని:—అయితే అమ్మా నీకు తిండి బట్టా పెడతాం యిక్కడఉంటావు—మాయింట్లో పని చేస్తువుగాని.

ఆ స్త్రీ:—(ఆశతో) అంతకంటేనా తల్లీ.

మోహిని:—అయితే యిక్కడపండుకో. తడి బట్టలు వదిలి నేను ఒకబట్టయిస్తాను కట్టుకో—అవును కాని నీపేరు?

ఆ స్త్రీ:—(కొంచము సేపాగి) కనికి.

మోహిని:—కనికి? కనికీ యిదుగో యీచాప మీద పండుకో.

లోపలనుంచి చప్పట్లు వినబడ్డాయి.

౪

కనికి చావిడితుడుస్తూంది. విజయకుమార్ చేత బెత్తం ఆడించుకుంటూ వసరాలోకి ప్రవేశించి ఠీవిగా 'కనికీ, మీఅమ్మగారేరీ?' అన్నాడు.

కనికి పరిహాసంగాఅంది—'అమ్మగారు అయ్యగారిదగ్గరకు వెళ్లారు' అని. కుమార్ కోపాన్ని కరిపిస్తూ 'ఎక్కడకి' అని గద్దించాడు.

కనికి:—(మందస్మితముగా) 'డాక్టర్ అయ్యగారింటికి!

కుమార్:—కనికీ నీవు మాటల్లో పలిటీలు కొట్టిస్తావే—చాలచమత్కారంగా మాట్లాడగలవు.

కనికి సిగ్గుతో తలవంచింది.

కుమార్ టేబిలువద్దఉన్న కుర్చీలోకూర్చున్నాడు.

కనికి:—లాంతర్లుతెచ్చి తుడుస్తూంది.

కుమార్:—కనికీ! నీముఖం నాకు చాలపరిచయంగాఉంది. నిన్ను నేను యెక్కడో చూసినజ్ఞాపకం.

కనికి:—(కంగారుని సవరించుకుంటూ) నేను మిలటరీ హోటల్లో కొన్నాళ్లు అంట్లు తోమడానికి ఉన్నాను. అప్పట్లో చూసిఉంటారు.

కుమార్:—యేమో యెక్కడచూసానో, జ్ఞాపకం మాత్రం లేదుకాని మొఖంమాత్రం చిరపరిచయంగానే ఉంది.

కనికి:—అదే అక్కడే అయిఉంటుంది.

కుమార్:—అయితే కనికీ నీకసలు పెండ్లి కాలేదూ?

కనికి:—(సిగ్గుతో మొఖం దాచుకుంటూ)యేమో?

కుమార్:—(ఆశ్చర్యంగా) యేమోనా? నీకు పెండ్లయిందో లేదో నీకే తెలీదూ?

కనికి:—నిజంగా తెలీదు.

కుమార్:—నీకు పెండ్లికాకపోతే నన్ను చేసుకుంటావు?

తుడుస్తూతుడుస్తూన్న లాంతర్లు వదిలేసి వంటయింట్లోకి పరుగెత్తింది కనికి.

కుమార్:—కనికీ—పరుగెడ్తే వదిలిపోతుందా? నిన్నుచూసినప్పటినుంచీ నాహృదయం నీమీదే అతుక్కుపోయింది.

కనికి:— (వంటయింట్లోంచి) మాయమ్మగారితో చెప్తానుండండి,

కుమార్:—(పక్కుననవ్వి) మీ అమ్మగారు? కుమార్ వంటయింట్లోకిపోయి కనికి చెయ్యిపట్టుకుని తలనిమురుతూ అన్నాడు—'కనికీ నువ్వు నేనూ కలసి యెక్కడికైనా పోదాం?'

కనికి నవ్వింది—

కుమార్:—అయితే రేపురాత్రి.

మెట్లమీద మోహనాంగి స్లిప్పర్ల చప్పుడయింది.

※

మోహనాంగిని మోసగించి మోహనాంగియింట్లో ద్రవ్యందొంగిలించి కనికినితీసుకుని విజయకుమార్ ఆవూరువచ్చి యించుమించు మూడునెలలు కావస్తుంది.

విజయకుమార్ మిక్కిలి వ్యాధిగ్రస్తుడై మంచము పట్టియున్నాడు. తానదివరకుచేసిన దుష్ప్రవర్తనా ఫలితముగా ఆరోగ్యముచెడి మిక్కిలి దీనస్థితిలో ఉండవలసివచ్చింది. కనికి అతనికి అన్నివిధాలా తోడునీడై ఉపచారంచేస్తూంది.

ఆరోజు ప్రొద్దునుంచి అదేవిధముగా నున్నది, కలవరింపులు, పిచ్చికేకలు—సంధిగుణాలు—కనికి అనేకవిధాల ఉపచారంచేసినా రోగం కుదరనందుకు విచారిస్తూ భగవంతునిమీద భారంవేసింది.

విజయకుమార్ హృదయంమీద తానదివరకుచేసిన దుష్టచర్యలు, విచిత్రజీవితం, తెరమీద సినీమాచిత్రాల మాదిరి కనిపిస్తున్నాయి. అప్పటికి అతనికి జ్ఞాననేత్రం తెరవబడింది. తన సతీమణి, పతివ్రతాశిఖామణి, పద్మిని తనకొనర్చిన మేలు, తను ఆమెకు తిరిగిఒనర్చిన ద్రోహం అప్పటి కతనిహృదయం గ్రహించగలిగింది. అతనిహృదయం పశ్చాత్తాపాగ్నిలో దహించుకు పోతూంది; పద్మిని మందస్మితవదనారవిందం సుందర విగ్రహం అతని కళ్ళకికట్టినట్లు కనిపిస్తుంది. మతి చలించిపోయింది. "పద్మినీ"అని ఒక్కనిట్టూర్పు విడిచాడు.

గ్లాసులో వైద్యుడిచ్చినమందు పోస్తున్న కనికి ముఖం యెఱ్ఱబారింది. శరీరం కంపించింది. వేగంగా పరుగెత్తుకొచ్చి కుమార్ కళ్ళలోకి చూసింది. కుమార్ కళ్లలో అశ్రుకెరటాలు పొరలిపోతూన్నాయి. అముఖంలో పశ్చాత్తాపము, వేదన, చింత, పొడకట్టాయి కనిక్కి.

తిరిగి కుమార్ 'పద్మినీ' అని రంకవేసాడు. కనికి కుమార్ను గట్టిగా కౌగలించుకుంది. యెఱ్ఱబారినకళ్లు పెద్దవిచేసి కుమార్ దుష్టురాల నాహృదయలక్ష్మి పద్మినినుంచి నన్ను వేరుచేసి పాపిష్టిజీవితమునకు పురికొల్పిన నీవే యీదుష్టస్మృతికి కారకురాలివి.

కనికి కన్నీరుతుడుచుకుంటూ గద్గదస్వరంతో ముఖంమీద కొంగుకప్పుకొని అంది—'యీపాపిష్టి కనికే ఆపాదుపద్మిని.'

అప్రయత్నంగా లేచికూర్చున్నాడు కుమార్. "రత్నమెక్కడ...బొగ్గక్కడ"

కనికి మరింతదగ్గరకుపోయి "రత్నమే బొగ్గు" అంది.

కుమార్:—"పద్మినివి నీవేఅయితే వక్షస్థలం మీది పుట్టుమచ్చ యేదీ?"

కనికి బట్టతొలిగించి వక్షస్థలంమీది పుట్టుమచ్చ చూపించి.

బోటుగాకూర్చున్న చేతులు జారిపోయి మంచం మీద కూలబడ్డాడు కుమార్.

ముద్దకడుతున్న గొంతుకతో — "ప ద్మి నీ"— పా...పి...ని..." అంటూ కళ్లుమూసాడు కుమార్.

# శ్రీరామశతకము

## శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మగారు

క. శ్రీరమణ! ముజ్జగంబుల, యారాటముమాన్ప దశరథావనిపతికిన్
గారాబుపట్టివై యిల, రారుమహీపాల! సురగణార్చిత! రామా!

క. అనఘా! నీగుణగణముల, సనకాదిమునీంద్రు లెన్నఁజాలకయుండన్
వినుతింపనేర్తునే? నీ, వనుపమదయ సూక్తులొసఁగు! మనయము రామా!

క. అజ్ఞానిని నేరను నీ, ప్రజ్ఞల మృదుభాషణములఁ బ్రస్తుతిసేయన్
సుజ్ఞానమొసఁగుమో ది, వ్యజ్ఞానానందరూప! యవ్యయ! రామా!

క. నీపదముల నెఱనమ్మిగ, నాపదలెల్లనుదొలంగు నతిశయసుఖమౌ
శ్రీపతి! నిన్నుఁగొలిచెద, నాపాపంబులఁబాపు! పతితపావన! రామా!

క. రారా! దశరథబాలా!, రారా! సుజనాళిలోల! రాజితశీలా!
రారా! కాంచనచేలా!, రారా! భూచక్రపాల! రవికులరామా!

క. జనకాజ్ఞం దలఁదాలిచి, మునిసవమునుగావ నలఘుమోదముతోడన్
జని, ఘోరదైత్యబృందము, ననిఁగూల్చిన బాలమోహనాకృతి! రామా!

క. ఉరుశాప నిపీడితయై, ధరణినిరాహారయగుచు దైన్యంబున నీ
వరుదేర నిరీక్షించెడి, పరశీలనహల్యఁ బ్రోచు వరదుఁడ! రామా!

క. స్మేరాస్యమొప్ప సీతా, నారీమణిఁ గనుచు, జనక నరవరునింటన్
గౌరీవల్లభు ధనువును, ధారణివినుతింపఁదునుము దశరథరామా!

క. పరమపతివ్రత నతిము, ష్కరుఁడై యెత్తికొని పఱువఁగడఁగు విరాధున్
బరిమార్చి, జనకతనయను, సరగునఁగైకొన్న పూర్ణశశిముఖ! రామా!

క. ఖరదూషణాది దైత్యని, కరములఁ జెండాడి, మౌనికాండంబులకున్
బరమానందమునిడు సుం, దరవదనాంబుజముఁ జూడఁదలఁచెద రామా!

క. సారంగరూపధరుఁడై, మారీచుఁడు చిక్కువెట్ట, మాయనెఱిఁగి, యా
క్రూరాత్ము నొక్కశరమున, ధారుణిఁబడఁగూల్చు శౌర్యధన! రఘురామా!

క. రాక్షసవిభుచే దురమునఁ, బక్షంబులు విఱుగఁగొట్టఁబడిన ఖగేంద్రున్
వీక్షించి, మేనునిమురుచు, నక్షయలోకంబు నిడుదయామయ! రామా!

క. జాలింద్యజించి, తమ్ముని, యాలింగొను దోషశీలి నతిబలశాలిన్
వాలి నొకకోలఁ బుడమిని, గూలిచి, సుగ్రీవునేలు కోసలరామా!

క. ధరణీసుతనరయుచు మీ, రరుగఁగ ఫలములను భక్తినర్పించిన యా
తరుణీలలామ శబరికిఁ, బరమపదంబొసఁగు భువనపావన! రామా!

క. దీనుండై నినువేడిన, దానవనాథానుజన్ముఁ దడయక, దయ స
న్మానించి రాజుఁజేసిన, దీనావన! ననుఁగృపాబ్ధి దేల్పవె! రామా!

క. అవనీప్రజ లలరారఁగ, భువనభరంబునువహించి, భూసుతతోఁడన్
బ్రవిమల కరుణావీక్షణఁ, బవనాత్మజుఁజేరఁదీయు పార్థివరామా!

క. రాజార్కనయన! నీపద, రాజీవ మరందపానరతి మాకిమ్మం
భోజాసనాది సురముని, రాజినుతా! వేడెదను పరాత్పర! రామా!

క. ఆరోగ్యంబుఁ జిరాయువు, వైరాగ్యము భూతదయయు భక్తియు సుఖముల్
ధీరత్వము నాపతికి ను, దారగుణా! సంతతికిని దయనిడు! రామా!

క. వినయము, విద్యయుఁ గరుణయు, ననయము నీపాదయుగళియందు మనంబున్
జనములకొసఁగవె! కృపతో, దినకరకుముదాప్తకోటి తేజా! రామా!

క. అనలుం, డర్కుఁడు, సోముం, డనిలుఁడుఁ దారలు, జలంబులవనియు నభమున్
ఘనతేజా! నీయంశము, లని నేభావించుచుందు ననయము రామా!

క. అనలునకు వసుమతీసురు, లనయము నాజ్యాతిపరమహావ్యము లొసఁగన్
అనిలమునఁగలసి యవి భూ, జనముల కారోగ్యమిడుట సత్యము రామా!

క. పరిమళపుష్పంబులు, న,త్తిరు మున్నగు వస్తుచయము దహనునివగిదిన్
గరువలి మలినముఁదీరిచి, నరులను రక్షింపఁజాలునా! రఘురామా!

క. మారుతములఁగల విషముల, వారింపంజాలువేల్పు వహ్నియెగాన్
భూరాజులు, మౌనులు ము,న్నారసి, పూజించినారలనలున్ రామా!

క. హోమద్రవ్యములెల్లను, ధూమములుగఁ బరిణమించి, తోయదచయమున్
వేమఱుఁబొందుచుఁ బ్రజలకు, క్షేమంబుగ వర్షమొసఁగు సీతారామా!

క. అనుదినముఁ బ్రభాతంబున, నినునకు వందనములిడినఁ దృప్తుండగుచున్
దనకిరణమహిమ నారవి, ఘనరుగ్బాధలను మాన్పఁగద! శ్రీరామా!

క. ప్రాణాయామము ననయముఁ, బూనికనొనరించు సాధుపుంగవులకు సు
జ్ఞానము, నాయువుఁ, గుశలము, మానక యొసఁగెదవుగాదె! మాధవ! రామా!

క. కలియుగమున నిట్టిసుక, ర్మములనెల్లఁ బరిత్యజించి, మానవు లకటా!
పలురోగంబులపాలై, పొలియుచునున్నారు భువనపూజిత! రామా!

క. సత్యము, దానముఁ, దపమును నిత్యము సలుపుచును, భక్తి నినుఁదలఁచుచు, దు
ష్కృత్యములఁ జేయనొల్లని, సత్యాత్ములఁగావుమయ్య! సదయుఁడ! రామా!

# ధర్మతల్లి

శ్రీమతి చుండూరి రమాదేవిగారు

ఆగుడిసెలో కాపురముండేది నేనూ, నాఅన్న వీరడూ, మాతండ్రీనూ. మా అమ్మ లేకపోవడంచేత, నేను చిన్నదాన్నవడంచేత కలిగినదాల్లోనే కొంత గారాబంగా పెంచేవాడు మాబాబు. నేను ఏటికెళ్లి చిన్నకడవ నెత్తిని పెట్టుకొస్తూంటే నే నెక్కడ డలసిపోతానో అని ఎదురొచ్చి చేతులలో కడవ అందుకొనేవాడు. నేను కంటికి అగపడని ఘడియ యుగంలాగుండేది. మా అన్నకూడ చెమటోడ్చి, కూలి పని చేసివచ్చి నాతో కాస్సేపు మాటలు చెప్పకుండా గంజి తాగేవాడు కాడు. యిల్లా గడచిపోతున్నాయి రోజులు. "పిల్లలు పెద్దవాళ్లైనారు, నాబాధ్యత తీరింది, యింకా సంసారలంపట మెందుక"ని కాబోలు-హటాత్తుగా కలరావచ్చి, కాలంచేశాడు మా బాబు.

నాకు పిచ్చెత్తింది. మాఅన్న పనిలో కెడితే ఒక్కదానికి తోచేదికాదు. మా అన్న, నేనూ ఒకరికొకరు ధైర్యము చెప్పుకొంటూ కొన్నాళ్లకు ఆదుఃఖము మరచిపోయాం. భగవంతుడు మాత్రం మమ్మల్ని మరువలేదు.

పదిరోజులనుండీ వూళ్లో అమ్మవారు తాండవమాడుతోంది. ఊరంతా అల్లకల్లోలంగావుంది. ఇప్పుడు చూసినవారు కాస్సేపటికి కానరావటంలేదు. చేసే జాతరలు చేస్తున్నారు. వేసే బలులు వేస్తున్నారు. పెట్టే నైవేద్యాలు యింటింటా పెడుతున్నారు. కాని ఆ తల్లికిమాత్రం అనుగ్రహం కలుగలా. మూడురోజులు యిట్లు ముమ్మరంగావుంది. తర్వాత నాలుగురోజుల్నుండీ అణగిపోయింది. ఎక్కడోగాని ఆమాట వినపడ్డంలేదు. కాని మావంతు మిగిలిపోయిందని కాబోలు మాఅన్నకుకూడ వాంతులు ప్రారంభించాయి. "పూజారి పాపయ్యగారైనా కనికరించి ఒకమాత్ర యివ్వకపోతారా" అని వెడుతున్నా నన్నమాటేగాని మనస్సులోలేదు. తలవంచుకొని మాస్థితి ఆలోచించుకుంటూ వెడుతున్నా. ఇంతలో "ఛీ! మాలముండా! కళ్లు కనపడవా! బ్రాహ్మణవీధిలో ప్రవేశించటమే కాకుండా వెధవముండని మణ్ణీళ్లు తెచ్చుకొంటూంటే, మీదిమీదికొస్తావా! మాయదారి స్వరాజ్యం వచ్చిందని మండిపోతున్నావేం!" అనే కేకలువిని తలెత్తి చూచేటప్పటికి దూరంలో బిందెడు నీళ్లు పారబోసి వెనుకకు వెళ్లే వితంతు వగుపడ్డది.

'అయ్యో! మమ్మల్నెంతహీనంగా చూస్తున్నారు! మాకింక ఉన్నతిలేదు కాబోలు! అని ఆలోచిస్తూ పాపయ్యగారింటికెళ్లి అయనను వేడుకొంటే పదిరూపాయలు ముందిచ్చి మాట్లాడమన్నాడు. నా తలమీద పిడుగుపడ్డట్టయింది. పదిరూపాయలు ఎక్కడ తేను! రెక్కాడితే కాని డొక్కాడని స్థితిలో మా అన్నకూడా పడిపోయాడు. నేనా ఆడదాన్ని! డబ్బు

యిచ్చుకోలేము. బాబూ! కనికరించాలని వేసుకొంటే నల్లరాయైనా కరుగుతుందిగాని పాపయ్యగారి హృదయంమాత్రం కరుగలా. ఇల్లు అమ్మేసి పదిరూపాయలూ తెచ్చిస్తేనే గాని మందిచ్చాడు కాదు పాపయ్యగారు. నిలువనీడలేక చెట్లక్రింద ఎండనక, వానసక నిలువవలసివచ్చింది. మా అన్నకు జబ్బు తగ్గుతే అదే పదివేలనిపించింది. ఆ మారెమ్మతల్లి దయవల్ల తగ్గుమొఖం పట్టింది. పథ్యం పెట్టుటకైనా చేతులో డబ్బులేదు. ఆకలితో అల్లాడిపోతున్నాడు మాఅన్న. మాఅన్న జబ్బుతో నీరసించిపోయాను. నిద్రాహారాలు లేవు. మండు వేసంగిఎండ. అలవాటులేని పని. ఎక్కడైనా గుప్పెడు గింజ లడుక్కునివచ్చి గంజి కాద్దామని బయలుదేరాను. సంపన్నులంతా భోజనాలయి తలుపులు బిగించేశారు. లోకం మొల్లాపోతే వారికేం? వూరంతా తిరిగినా ఒక్క కబళమయినా దొరకలా! నాకు కూడా ఆకలి దహించుకుపోతోంది. నిల్చునే శక్తిలేదు. మాఅన్నస్థితి మనస్సు కలిచేస్తోంది. నాకు కేకేసేశక్తిలేక, ఒక అరుగుమీద కూలబడ్డాను. స్పృహ తప్పింది.

కళ్లుతెరచి చూసేటప్పటికి నాదగ్గిర కూచొని ఒక పుణ్యాత్మురాలు నా నోటిలో అన్నరసం పోస్తోంది. తెప్పిరిల్లి నిర్ఘాంత పోయాను. 'అమ్మా! నేను మాలదాన్ని' అన్నాను. 'అయితేనేమీ పిచ్చిదానా! భగవంతుడుచేసే సృష్టిలో కులభేదములున్నాయా! మనుష్యులు తెచ్చిపెట్టకొన్నవే గాని!' అంటూ కళ్లుమూసుకొని కొంచెము సేపు పడుండమని హెచ్చరించింది ఆ పుణ్యాత్మురాలు. ఆమె పోసిన జావ అమృతం లాగున తాగేశాను. కొంచెము స్పృహ వచ్చి కూచోటానికి శక్తివచ్చింది. లేచి కూర్చున్నా. ఆ బ్రాహ్మణవితంతువ మా స్థితినిగురించి చాలాసార్లు గుచ్చిగుచ్చి అడిగింది. చెప్పక తప్పిందికాదు. మా సంగతంతయు, పూసగ్రుచ్చినట్లు చెప్పేశాను. వింటున్నంతసేపు ఆమెకంటినుండి నీళ్లు కారుతూనే ఉన్నాయి. 'ఇంత చిన్నతనంలో నీ కెన్నికష్టాలే' అంటూ ఇంట్లోకెళ్లి ఇంతన్నం, కూరవట్టుకొచ్చి, మా అన్నకుపెట్టి నీ వింత తినమని ఒళ్లోవేసింది. ఆమెకు నాకృతజ్ఞత ఎట్లాచెప్పాలో తెలియలేదు. నమస్కారంచేసి ఆ చల్లనితల్లిని తలచుకుంటూ మా అన్నదగ్గరకు బయలు దేరాను. మా అన్నకు ఆ తల్లిపెట్టిన అన్నం పెట్టాను. కొంచెం నేడదీరిన తర్వాత ఆ పుణ్యురాలి కథంతా మాఅన్నకు చెప్పాను. మాఅన్న "ఆమె మానవస్త్రీ కాదు. మన పాలిటి ధర్మదేవత" అని చేతులు జోడించాడు. మర్నాడు ఆతల్లి మాఅన్నకు, నాకూ కొద్దిరోజులవరకు సరిపోయే బియ్యము పంపించింది. మళ్లీ మాఅన్న కూలిపనిలో శళ్లేదాకా సరిపోయినవి. ఏదోమాదిరిగా మాఅన్న కూలిపని చేసుకొని తెచ్చే డబ్బునల్ల జీవిస్తున్నాం. లోకంలో యిటువంటి ధర్మతల్లులున్నారు క్రూర జలచరముల కాకరమైన సముద్రమున మాక్తికములూ, మణులూ వున్నట్లు.

# సమాజం సాధించనిదేదీ లేదు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

సుప్రసిద్ధమైన ఆంధ్రుల ప్రాచీనచరిత్రతో అత్యంత సంబంధము గలిగినటువంటిన్నీ యిప్పటికి 74 లక్షల ఆంధ్రులకు ప్రభుత నెఱపుచున్నటువంటిన్నీ యీ హైదరాబాదుసంస్థానమును జూడవలయునని నేను చాలా కాలమునుండి కుతూహలపడుచుంటిని కాని నెరవేరలేదు. నేడు ఆంధ్రయువతీమండలివారు కడుదూరానవున్న నన్ను క్షణములోరప్పించి మీ సమక్షాన ఉంచగలిగారు. ఈవొక్క విషయాన్నిబట్టే స్త్రీసమాజాల వల్లకలిగే లాభం విదిత మవుతున్నది. ఈమండలి అనేది లేకపోయినట్లైతే మనం ఒకరి నొకరం చూచుకోవలెనని యెంత అభిలాషపడుతున్నా యింతలో తీరేది కాదు. అందువల్లనే నేను మామండలిలో మాపుర స్త్రీలయెదుట వొకమారు యిట్లా చెప్పాను.

వివిధ దేశములందు వెలపెడివార్తల
 నేనాటికానాడె యెఱుగవచ్చు
నిజదేశమునగల్గు నిఖిలవిశేషముల్
 తేటతెల్లముగాగ దెలియవచ్చు
ప్రాచీనగాథల పరమార్థమెల్లను
 నింపుగా మది గ్రహియింపవచ్చు
మాన్యులౌ పెద్దల మహనీయబోధలు
 వీనులవిందుగా వినగవచ్చు
పరగనన్యోన్య పరిచయ భాగ్యమునను
స్నేహమభివృద్ధి జెందంగ చేడెలంద
ఱొక్క తల్లిబిడ్డలవలె నుండవచ్చు
స్త్రీసమాజంబు లిడు మేలు జెప్పదరమె.

ఈకలియుగమున మానవశక్తి సమాజసంఘటనపై ఆధారపడివున్నది. సంఘశక్తి అమోఘమైనది. అత్యల్పప్రాణులైన చీమలుసైతం సంఘశక్తిచేత కాలసర్పాన్నిగూడా సంహరింపకలుగుతవి. అంటే విద్యావివేకసంపన్నమైన మానవుల సంఘీభావము మహత్తరమైన కార్యసాఫల్యత కలిగించడానికి సందేహంలేదు. మనుజాలు సమాజంగా సంఘజీవులు. ఒంటరిజీవం మానవప్రకృతికి విరుద్ధం. కనుక యేపనినైనా మానవులు సమూహంగాయేర్పడి నెరవేర్పడం కార్యసిద్ధికి అమోఘసాధనంగా గణింపబడుతున్నది. ఈవిషయంగుర్తించే నేడు మనభారతదేశంలో స్వరాజ్యోపలబ్ధికి కృషిచేసే దేశసేవాపరాయణులు మొదలు స్వల్పాతిస్వల్పప్రయోజనమాశించే చిన్న చిన్న తెగలవారుసైతం సంఘములుగా యేర్పడి తమ తమ కార్యసాఫల్యతకు ప్రయత్నంచేస్తున్నారు.

మన భారతమహిళాసంఘం భారతదేశ జనసంఖ్యలో సగానికి మిగిలివున్నది. బాహుళ్యమైన యీ సంఘం అభివృద్ధిపొందవలెనంటే యిటువంటి యువతీమండలులెన్నో గ్రామగ్రామమునవెలసి మహిళా సంఘోద్ధరణకై నిరంతరకృషి చేయవలసియున్నది. స్త్రీసమాజములవల్ల స్త్రీలలో విద్యావిజ్ఞానము స్నేహమూ, అయికమత్యమూ, పరస్పరసహకారభావము మున్నగు ప్రయోజనము లెన్నో కలగడమే కాకుండా ధార్మికభావమూ పరోపకారచింత సేవాభిలాష ఆదిగాగల ఉదారగుణములెన్నో విస్తరిల్లడానికి అవకాశంవున్నది. అంతేగాదు. స్త్రీలలో బాలికలలో నిగూఢమై అవకాశములేక బహిర్గతము కాకుండావున్న కళాప్రావీణ్యతగూడా స్త్రీసమాజములవల్లనే వెల్లడిలోకివచ్చి సంఘాభివృద్ధికి ఉపయుక్తపడేటట్టుగా చేస్తుంది. పెక్కుమాటలెందుకు

చక్కని నిర్వహణసామర్థ్యములంటే స్త్రీసమాజములు నిర్వహింపజాలని కార్యమేలేదు.

అయినప్పటికీ ఆ దేమి దురదృష్టమోగాని దాదాపుగా ముప్పదిసంవత్సరాలుగా స్త్రీ సమాజలేర్పడి పనిచేస్తున్నా మనదేశంలో స్త్రీ సమాజాలంటే మనస్త్రీలకే అభిమానంలేదు. సరిగదా వానిలో చేరడం అగౌరవమని భయపడేవారు గూడా వున్నారు. ఇంతకంటె వెఱ్ఱి అభిప్రాయం కేఱొకటి లేదు. ఇది తనవ్యాధి నివారణకు కృషిచేసే వైద్యుణ్ణి తనకు మహోపకారంచేసే శత్రువనీ, తనప్రాణాలు నా కక్కఱలేదని తిరగబడటం వంటిది. మనుష్యులను బాగుచేయడానికే సంఘాలు కావాలెగాని చెడగొట్టడానికి అక్కరలేదు. వారివారి అభాగ్యంకొద్దీ ఒకరి యత్నం లేకుండానే కొందఱు చెడుతుంటారు. స్త్రీ సమాజాల ఆశయం మాత్రం అదికాదు. విద్యకు దూరమై విజ్ఞానానికిఁ గొఱగాపై మతస్వాతంత్ర్యంలేక సంఘగౌరవంలేక ఆర్థికసౌకర్యంలేక సర్వవిధాలా అధఃపతితమైయున్న స్త్రీ సంఘాన్ని ఉద్ధరించడమే స్త్రీ సమాజముల ముఖ్యోద్దేశం. ఇటువంటి సదాశయంతో యేర్పడే స్త్రీ సమాజములపై స్త్రీలు నిరసనభావంగలిగి ఉండడం చాలాపొరబాటు. ఈ స్త్రీ సమాజములపై అభిమానంలేనివారు వివిధవిభాలుగా ఉన్నారు. స్త్రీ సమాజముల ప్రయోజనం తెలియక కొందఱు, స్వాతంత్ర్యంలేక కొందఱు, పారమార్థిక విషయంగాదని కొందఱు మహిళామండలులలో చేరకుండటం చూస్తున్నాము. తెలియనివారికి తెలిపి వొప్పించవచ్చును. తెలిసీ స్వాతంత్ర్యలేక రానివారిని మనమేమీ అనజాలం పారమార్థికంగాదనే వేదాంతులు స్త్రీ సమాజాలలో జరిగేవన్నీ లౌకికవ్యవహారాలనీ ఇందువల్ల మనకు ముక్తిమోక్షం కలగదనీ 'రామ, 'కృష్ణ' అని నామమాత్రంగా అంటేనే మనకు మోక్షం అరచేతిపై కుంతంకాగలదని అనుకోడం వట్టి భ్రాంతి. అకలంకమైన భక్తిజ్ఞాన వైరాగ్యాదులు లేక మోక్షమాశించడం నిష్ఫలం. నిజమైన భక్తిజ్ఞానాదులు కలవారు ఐహికకార్యకలాపంలోనైనా మోక్షాన్ని సాధించగలరు. మోక్షమనేది మనుజుల నిర్దుష్టమైన ప్రవర్తనలోను నిరుపమానమైన భగవద్విశ్వాసములోను,నిస్వార్థసేవాపరాయణతలోను కలదు. కాని వాగాడంబరంలోను బాహ్యానుష్ఠానంలోనులేదు. మన జన్మతరింపుకు యేరామకృష్ణుల నామ సంకీర్తన ముఖ్యమని తలుస్తున్నామో ఆ రామకృష్ణులైనా లౌకికవ్యవహారాల్లో జోక్యం కలిగించుకోకుండా ప్రవర్తించి ఉండలేదు. దుష్టశిక్షణకొఱకు శిష్టరక్షణకొఱకు వారు చేసిన మహత్తరకార్యములే వారిని దేవాంశసంభూతులుగా జేసినది. ఆ అవతారపురుషులు లౌకికకర్మలలో నిర్లిప్తులై తాము ప్రవర్తించినదేగాక తమ సతులనుగూడా ప్రవేశపెట్టారు. చూడండి. సీతామహాదేవి స్వయముగా చెఱబోయి పదినెలలు రావణుని గృహమున నివసించేవఱకు లోకకంటకుడైన రావణుని సంహారయత్నం జరగలేదు. స్వయముగా సత్యభామాదేవి విల్లు నమ్ములు చేపట్టితేనేగాని నఱకుడిచెఱలోవున్న పదహారువేల రాచకన్నెలకు బంధవిముక్తి కలుగలేదు. కనుక రామకృష్ణులను స్మరించడమంటే పరమపవిత్రమైన వారి జీవితచర్యలను మన జీవితాదర్శంగా పెట్టుకొని మన అనుదిన జీవితక్రమంలో అవి అనుష్ఠించడమే కాని మన స్వేకచోట బెట్టుకొని చేతితో ఒక పని చేస్తూ నాలుకతో 'రామ రామ', 'కృష్ణ కృష్ణ'అని ఉచ్చరించడం గాదు.

ఎవరు అవతారమూర్తులో వారే లౌకికవ్యవహారాలను పరిత్యజించనప్పుడు మనలను పరిత్యజించమంటారా? జీవు లెప్పుడు కర్మపరతంత్రులు. మనం వద్దనుకున్నా యేదో కర్మ చేస్తూనే ఉంటాము. కాళ్లు కట్టేసుకు కూర్చున్నా మనస్సు మూడు లోకాలు తిరిగివస్తుంది. ఏమి చేయకుండా కూర్చోడమనేది ప్రకృతికే విరుద్ధం కనుక బాగాఆలోచిస్తే

స్వర్గ నరక హేతువులు రెండేవున్నవి: పరార్థము, స్వార్థము. పరశ్రేయస్సుకొఱకు యేదైతే చేస్తామో అది లౌకికమైనా పారమార్థికమే. మోక్షదాయకమే. స్వార్థంకొఱకు యేదిచేస్తామో అది బాహ్యానికి పారమార్థికతంతుగా కనబడ్డా అది నరకహేతువే. కాబట్టే స్వార్థలాభంతో కూడుకున్నది కనుక మోక్షాపేక్షగూడా దోషహేతువని పెద్దలు చెప్పారు.

నేడు దేశంలో పారమార్థికవేషంతో కపటవేదాంతమొకటి ప్రచారమవుతున్నది. ఈవేదాంతంలో యీభక్తిలో ముముక్షువులకు ముఖ్యమైన అంతఃకరణశుద్ధి లవలేశమైనాలేదు. పరార్థచింత అసలే సున్న. గురువు లనబడేవాళ్లు శిష్యులచేత వివిధ శుశ్రూషలు చేయించుకోడం ద్రవ్యం స్వీకరించడం పరిపాటైపోయింది. బోధగురువులకంటె బాధగురువు లెక్కువైపోయినారు. ఈరోజుల్లో ఈ గురువులవల్ల అమాయకమైన స్త్రీసంఘంలో జరుగుచున్న అత్యాచారాలు వినడానికి కనడానికి దుస్సహంగా వుంటున్నవి. నాగరికత మెచ్చుమీరిన యీకాలంలో గూడా యింకా మన దేశస్త్రీలపై బవిరిగడ్డాలు, కాషాయవస్త్రాలు విభూతిపిండికట్లు రుద్రాక్షమాలలు తాయత్తులు రక్షరేకులు వేరులు వెల్లంకులు మంత్రతీర్థాలు గురూపదేశాలు యిత్యాది ఆత్మవంచన పరవంచన దైవవంచన కృత్యాలే రాజ్యం చేస్తున్నవి. లోకవంచనవల్ల జీవించే పైతరగతులవారిని ముక్కాలు మువ్వీసం మనస్త్రీలే పోషిస్తున్నారు. ఈస్థితి తలుచుకుంటే మనస్త్రీలలో అజ్ఞాన మెంత ఘనీభవించివున్నదీ విదితమగుచున్నది. శోచనీయమైన యీస్థితినుండి స్త్రీసంఘ మెంత త్వరగా విముక్తి పొందితే దేశాని కంతత్వరగా శ్రేయస్సు కలుగుతుంది.

స్త్రీ బాధ్యతావిరహితమైన ప్రాణి గాదు. మతమును రక్షించే బాధ్యత సంఘమును రక్షించే బాధ్యత జాతిని రక్షించే బాధ్యత స్త్రీదే. రాష్ట్రేతరాంధ్రస్త్రీలగు మీపై దేశీయములైన వేషభాషాసాంప్రదాయములను కాపాడే బాధ్యతగూడావున్నది. ఆ విషయములో మీరు జాగరూకత వహించకపోతే ఉద్ధతులమధ్య పేదవోలె తెలుగుదనము నశించిపోతుంది. స్త్రీలు యేవంవిధమైన బాధ్యతలు నిర్వహించవలెనంటే సమగ్రవిద్యావతులు కావాలె. కాని మన దేశమునందలి స్త్రీవిద్యనూ అందు ముఖ్యముగా మీ నిజాంరాష్ట్రాంధ్రస్త్రీ విద్యావంతుల లెక్కను చూస్తే చాలా విచారం కలుగుతుంది. ఈరాష్ట్రంలో హిందువులలో చదువుకొన్న స్త్రీలు 303కి ఒకరు అని యీమధ్య ఒక పత్రికలో వ్రాయగా చూచాను. మొత్తముమీద చూస్తే మీరాష్ట్రంలో వేయింటికి 11 మంది స్త్రీలుమాత్రమే చదువుకున్నవారని తెలుస్తున్నది. పరదేశాల్లో స్త్రీలు నూటికి నూర్గురు చదువుకొన్నవారైయుండగా నీ దేశంలో నూటికొక్కరు మాత్రమే చదువుకున్నవారై ఉండటం యెంత దుఃఖకరము! మనుజుల అజ్ఞానతమస్సు పోకార్చడానికి విద్యయే దివ్యజ్యోతి. ఆ జ్యోతీసందర్శనం కానంతవఱకు భారతస్త్రీకి మోక్షంలేదు. స్త్రీలెల్లరు విద్యావతులు కావడానికి మహిళాసంఘములు మునుముందు పాటుబడాలె. బాలికాపాఠశాలలవల్లనేగాక వయోజనవిద్యాశాలలవల్లగూడా స్త్రీల యవిద్యను బాపడానికి గట్టిప్రయత్నం చేయాలె. మా బ్రిటిషుయిండియాలో ఒక్క సంస్కారం జరగవలెనంటే యెంతో ప్రయత్నంచేయాలె. యెన్నో చట్టసభలు దాటాలె. ఇంగ్లండుదాకా పోవాలె. మీ కటువంటి శ్రమలేదు. ముంగొంగున పసిడిగలవారు మీరు. 1,44,36,148 జనసంఖ్యగల సంస్థానం మీది. ప్రపంచమంతటికీ ధనాఢ్యుడని విఖ్యాతిగన్నవారు ఘనతవహించిన మీ ప్రభువుగారు. వారి ఆమోదంవుంటే మాకంటే మీరే ముందుగా విద్యాభివృద్ధిని పొందవచ్చును. మన



వంటింట్లో

దేశంలో బ్రిటిషిండియాలోకంటే కొచ్చి, తిరువాన్కూరు మున్నగు స్వదేశసంస్థానాలే స్త్రీవిద్యయందగ్రగణ్యంగావున్నవి. కనుక మీరుగూడా అట్టి గణ్యత సంపాదించుకోవడానికి ప్రయత్నంచేయాలె. ఈ వొక్క విద్యావిషయంలోనేగాక మత సాంఘిక ఆర్థికాది విషయాల్లోగూడా స్త్రీ చాలా సంస్కారం పొందవలసివున్నది. ఈ సంస్కారంకొఱకు భారతస్త్రీలు కొన్నాళ్లుగా చాలా కృషిచేస్తున్నారు. ఆకృషి ఫలితంగా విద్యార్హతగల స్త్రీకి వోటింగు హక్కు, శారదాచట్టమువంటి వివాహసంస్కారచట్టమూ, స్త్రీల హక్కులను యినుమడింపజేసే దేశముఖుగారి బిల్లువంటి బిల్లులూ, స్త్రీపురుష సమానహక్కులకై చేయబడే తీర్మానములు బయలువెడలినాయి. భారతస్త్రీల ఆందోళన యిట్లావున్నది. ఇవి మీ సంస్థానమున కెంతవఱకు వర్తిస్తాయో నాకు తెలియదు. బహుశా యిచట తక్కువనే అనుకుంటాను. అయినప్పటికీ కొంతకు కొంతైనా యీ పరివర్తనప్రభావం మీమీదగూడా ప్రసరిస్తున్నదనే అనుకుంటాను. అట్లా ప్రసరించకపోయినట్లైతే యుగపరివర్తనధర్మానికి మీ రింకా కడుదూరంగావున్నారని చెప్పవలసివున్నది. అఖండమైన యీ భారతమహిళాసంఘంలో యేప్రాంతము వెనుకబడివున్నా విచారమే. ఏలనంటారా శరీరంలో యేఅవయవం సన్నగిలియున్నా దేహంయొక్క సౌష్టవస్వాస్థ్యాలు చెడివున్నట్లే గదా. కనుక భారతమహిళయొక్క సర్వాంగసౌందర్యమునే మనం కాంక్షించాలె. మేము వినా మీ అభివృద్ధిగాని మీరువినా మాఅభివృద్ధిగాని అభివృద్ధిగాదు. కనుక సర్వతోముఖాభివృద్ధికై స్త్రీలెల్లరు కృషిచేయవలసివున్నది. దేశంలో జరిగే మార్పులు స్త్రీలు యెప్పటికప్పుడు తెలిసికోవలసివున్నది. ఆవిషయం తెలుసుకొనిన ప్రతిస్త్రీ దానిని తమ స్త్రీలకు తెలియజేయవలసివున్నది. అట్లా వ్యాప్తిపొందించవలెనంటే అందులకు స్త్రీసమాజాలే ముఖ్యసాధనలు.

ఒక్క స్త్రీసమాజముంటే దానివలన నెంతో ప్రచారం చేయవచ్చును. గ్రంథాలయము, పఠనమందిరము, ప్రబోధోపన్యాసాలు, మ్యాజిక్ లాంతరు ప్రదర్శనాలు, వయోజనపాఠశాలలు మున్నగు శాఖల ద్వారా స్త్రీలను ప్రబోధింపవచ్చును. యింతేకాక సేవాశాఖను నెలకొల్పి వ్యాధి, ప్రసూతి మున్నగు పట్టుల స్త్రీల కవసరసహాయములను కళాశాఖను నెలకొల్పి సంగీతము, చిత్రలేఖనము, నృత్యము మున్నగు హృదయంగములగు లలితకళాప్రవేశమును, గృహపరిశ్రమశాఖను స్థాపించి చేతిపనులద్వారా ఆర్థికోపపత్తి మార్గములను స్త్రీలకు బోధింపవచ్చును. వ్యాయామశాఖను నెలకొల్పి స్త్రీల ఆరోగ్యమును పెంపొందింపవచ్చును. క్రీడాశాఖను నెలకొల్పి స్త్రీల మానసోల్లాసం ద్విగుణీకృతం చేయవచ్చును. వేయేల. స్త్రీమండలి అనే కల్పవృక్షంద్వారా స్త్రీ పడయరాని ఫలంలేదు. కాని యీవృక్షానికి పైపైనిపట్టి సౌందర్యంచెఱిచే చీడపురుగులు కొన్నీ, తల్లివేరునే కొఱికి మొదలంట నిర్మూలించే పురుగులు కొన్నీ వున్నవి. అసూయ, అనైకమత్యము, భిన్నదృష్టి, వర్గద్వేషము యివే వీటికిబట్టే చీడపురుగులు. ఈ పురుగులు పట్టకుండా ప్రతిస్త్రీ శ్రద్ధా, అభిమానము వహించి ఈ సమాజమనే మొలకను యెందుకు నాటినామో ఆవిషయం గుర్తెరిగి వృక్షం పెంపొందడానికగు దోహదములన్నీ చేసి ఫలితం పొందడానికి ప్రయత్నంచేయాలె. ఎవరికి వారిది తమ పెరటికల్పకమనే అనుకొని దానియొక్క అమృతఫలాలను అనుభవించడానికి ఉవ్విళ్లూరాలె. ఏనాడైతే ప్రతి స్త్రీహృదయాన ఈ సమాజకల్పకంపై ఆదరాభిమానాలు ఉదయిస్తాయో ఆనాడు స్త్రీసంఘం అభివృద్ధికి వస్తుంది. స్త్రీసమాజం అనైకమత్యాది చీడపురుగులు పట్టితే యెట్లా దిగజీసిపోతుందో, ద్రవ్యమనే నీళ్లు లేకపోతే అట్లా నీరసించిపోతుంది. కనుక యీ మొలకద్రవ్య

లేబరంచేత శోషిల్లకుండా కాపాడుకొనే బాధ్యత గూడా మనమీదనే ఉన్నది. 'ధనమూల మిదం జగత్'. ద్రవ్యములేక యేపనీ సాగదు. కనుక స్త్రీ లెల్లరు యథోచితములైన చందాలనే సమాజపోషణకు దొరకొనడమే గాకుండా సమాజము శాశ్వతముగా నుండుటకును యితోధికముగా వృద్ధిపొందుటకును సొంతభవనముగూడా యేర్పడిఉండటం అత్యంతా వశ్యకమైయున్నది స్వజాత్యభ్యుదయకాంక్షగల యీ భాగ్యనగరస్త్రీలు ఈ ఆంధ్రయువతీమండలి కట్టి భాగ్యం అనతికాలంలో కలిగిస్తారని నమ్ముతాను.

ఆదర్శప్రాయమైన వర్తనమే వ్యక్తికిగాని సంఘానికిగాని గౌరవం చేకూర్చుతుంది. కనుక యీసంఘ సభ్యురాండ్రు చేసే ప్రతి సేవాకార్యములోను పూసలలో దారంవలె నీతిసూత్రం పొంది పోసగివుండటం ఆవశ్యకమని విన్నవిస్తున్నాను. హృదయ మెఱుంగ గలవాడు భగవంతుడు హృదయపూర్వకమగు కృషికి భగవంతుని తోడ్పాటు తప్పక కలిగితీరుతుంది. ఆ భగవదాశీర్వాదమును పొంది మీ ఆంధ్రయువతీ మండలి అనే ద్వివర్షప్రాయమైన మొలక పెరిగి పెద్దదై శాఖోపశాఖలుగా విస్తరించి పత్రపుష్ప ఫల విరాజితమై విల్లసిల్లవలెనని కోరుతున్నాను.

నేనును ఒక సమాజమునకు కార్యదర్శిని అగుట వలన నా అనుభవములను ఆదర్శములను అభిప్రాయములను మీవద్ద యేకరువుపెట్టితిని. ఇందలి లోపములను పరిహరించి గుణములను మాత్రమే స్వీకరింపవలెనని ప్రార్థిస్తున్నాను.*

---

# గృహలక్ష్మీ గౌరవము

శ్రీ కవితాభూషణ - శతావధాని - విద్వాన్ - దోమా వేంకటస్వామిగుప్తగారు

మ॥ స్పృహ ప్రాణేశ్వరుఁడున్ దదీయగృహనుర్వీమండలం బెల్లఁ బ్రఁ
త్యహముఁన్ సర్వసుఖంబు లందవలె నంచాత్మన్ దగన్ - లోన నే।
యహముం జెందక విశ్వమానవహితోదారక్రియం బోల్చు త!
ద్గృహలక్ష్మీమణికి న్నమస్కృతులఁ గావింతున్ సభక్తిన్ మదిన్॥

మ॥ అహ మేఁపారని నమ్రభావమును - నాత్మాధీశు కందోయి క।
న్వహమున్ బంగఁరు బొమ్మయై పొలుచుదివ్యంబైన రూపంబు - నిఁ।
కిహ మన్యంబును బుట్టి మెట్టు నెడ లెంతేమించ వర్తించు త।
ద్గృహలక్ష్మీమణికిన్ నమస్కృతులఁ గావింతున్ సభక్తిన్ మదిన్॥

మ॥ సుహృదంభోజము శాంతిదాంతియుత - మెచ్చు న్నమ్రభావంబు - రూ।
పు హృదుల్లాసనురీతినిం దేలుపు - వాత్సల్యత్వమున్ - నిర్మల।
స్పృహమై నింటను బిన్నపెద్దల పనుల్ చేతల్ తగం బోల్చు మేల్।
గృహలక్ష్మీమణికి న్నమస్కృతులు గావింతున్ సభక్తిన్ మదిన్॥

---

* హైదరాబాదు ఆంధ్రయువతీమండలి వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసము.

# పతనానికి కారణమువేరు

శ్రీమతి డి. అనసూయమ్మగారు

మన హిందూధర్మానుసారము స్త్రీల జీవితమునకువివాహమొక మార్పైయున్నది. ఆమార్పు రెండుశాఖలుగా మారుచున్నది. అందొకశాఖ సుఖవాహినిలోను రెండవ శాఖ దుఃఖవాహినిలోను జేర్చును. బాలికలు తమ మనోనేత్రములను విచ్చి ప్రపంచ పరిస్థితులను వీక్షించక పూర్వమే వారిని వివాహమను నదిలోద్రోసి వారి మనోవికాసమును వృద్ధిపొందనియ్యక వినాశమొనర్చుట ఎంత కఠినము ఎంత అవివేకము.

ఈ విషయములను గమనించియే దేశోద్ధారకులు బాల్యవివాహ నిషేధముకై శారదాబిల్లును స్థాపించి దానివలన బాలికలకు జ్ఞానోదయానంతర వివాహములు జరుగుననియు తగినపతి నెన్నుకొని సుఖింతురనియు బాలవితంతువుల సంఖ్యరూపుమాయుననియు తలంచిరి. కాని చాల వరకట్లు జరుగుటలేదు. బాల్యవివాహములు సహితమింకను జరుగుచునేయున్నవి. సరికదా ఒకవేళ శారదాశాసనమునకు వెరచి బాల్యవివాహము లొనర్పక రజస్వలా వివాహము లొనర్చినను అవి తలిదండ్రుల ఇష్టప్రకారమె జరుగుచున్నవిగాని బాలికల ఇష్టప్రకారము జరుగుటలేదు. దానంజేసి దేశోద్ధారకులు శ్రమించి స్థాపించినందుకు శారదాబిల్లు బాలవితంతువుల సంఖ్యను మాత్రము కొంతవరకు క్షీణింపజేసి యుండవచ్చును కాని మానినులనుకూలదాంపత్యమువడసి సుఖించుచున్నట్లు కన్పించదు. అట్లు సుఖించుచున్నట్లైతే మన దేశమున ప్రతిత స్త్రీల సంఖ్యయె యుండకూడదుకదా. ఆలాగు సుఖించకుండుట కేమికారణమైయుండును? పిత్రాదుల మూర్ఖతయే ముఖ్యకారణముగనున్నది. బిడ్డలకు బాల్యమున చక్కగ విద్యచెప్పించవలసిన బాధ్యత తలిదండ్రులయందే యున్నది. బాలికలకట్లు విద్య చెప్పించి బాల్యవివాహము లొనర్పకుండుట యొక కారణము. అప్పటికి వారికి తగిన భర్తను వరించు జ్ఞానము కలుగును. కాని దుర్బలహృదయులగు మానినుల మానసికము నావరించియుండు సిగ్గు భయము అను పిశాచములు వారి యూహలను వెలివడనీయక అణచివేయుచుండును. "ప్రకృతి" నూత్నావలోకినులగు వారికి సంఘచట్టము యొక్క కఠినత బోధపడదు. దాని క్లిష్ట పరిస్థితులను అనుభవించియున్న తలిదండ్రాదులు బాలికల మనోభిలాష తెలిసికొనకయే తమ యిచ్ఛానువర్తనగా వివాహమొనర్చుట మూర్ఖతయగును. పూర్వము పతివ్రతలైన నారీమణుల వివాహములెట్లు జరిగినవి. సావిత్రి తండ్రియగు అశ్వపతి వివాహమునకు పూర్వము తన పుత్రికను జేరదీసి "తల్లి నీగుణరూప వృత్తములకెందు తగినవరు నీవ యిమ్ముగ దడవి నెమ్మి నీమనస్సున కెక్కిన నృపకుమారు గోరి వరియింపు మిదియ

నాకును ప్రియంబు" అని బోధించినట్లు భారతము చెప్పుచున్నది. ఇప్పటి తలిదండ్రుల కట్టి పరిజ్ఞానమున్నదా? తామొనర్పవలసిన అమూల్యకర్తవ్యమును జారవిడచి తమ బిడ్డలు శీలవతులు కావలయునన్న ఎటులయ్యెదరు? మానిని తన యిచ్ఛానుసారము వరించిన భర్తకు ఎట్టి లోపములున్నను లేక కలిగినను సంస్కరించుకొనవలసిన బాధ్యతగలదు. సంస్కరించుననుకూడ. కాని తలిదండ్రాదులు వరించి చేసిన భర్తను ప్రేమించుట కెట్లు సాధ్యమవును? ఈ అక్రమవివాహములను మన సంఘ మంధత్వముతో నంగీకరించుట చేత గదా సుశీలలగు భారతస్త్రీలు మనోవ్యథచేత క్రుమ్గుటకుగాని పతితులగుటకుగాని కారణము. దేశోద్ధారకులు దీనినేల సంస్కరింపగూడదు?

—:0:—

# నా భాగ్యము

నాదుభాగ్యంబుఁ గొనియాడ నలవిగాదు
నాదుసౌభాగ్యమెన్నంగ నలవిగాదు
నాదుసౌఖ్యంబ దెన్నంగ నలవిగాదు
పూర్వజన్మకృతఫలంబుఁ బొగడఁదరమె.
నన్నుఁగనిపెంచి పెద్దగా ననుగఁజేసి
వినయసౌశీల్యసంపద లనయమొసఁగి
చదువు సంధ్యలనేర్పించి జాణఁజేసి
నాదు సౌఖ్యంబుఁగోరిన నాదుజనని
జనకులకుమఁందు ప్రీతి నంజలిఘటింతు.
మాదుగారంపుఁబట్టి భాగ్యోదయంబె
మాకుఁగోరఁదగినదని మాన్యులైన
జననిజనకులు ధన్యులు ఘనతఁగన్న
వరునిఁజూచియు పెండ్లిఁజేసిరితనయకు.
అత్తవారింటికేగుట మిత్తివాత
బడుటయేయని కొందఱు పడుచులనుట
అత్తకోడళ్ల కయ్యాల ననవరతము
వినుచునుండుట భయమాయె; వినఁగుదోఁచె
అత్తవారింటికేగుట క్రొత్తదోఁచె
కానియనుకొన్నదంతయుఁ గల్లయాయె
అత్తమామలకేనన్న నధికప్రేమ [గూర్చ
ముద్దుకోడలమారు "అమ్మాయి ముదమఁ
చిన్నిపాటను పాడుమండ్రెన్నొసార్లు
పాడఁగానేను సంతోష వార్ధిమునిఁగి
ఇట్టికోడలు మాపుణ్య మట్టిపడగ
మెట్టినదిమాగృహంబని మిగులప్రీతి
అమిత యానందముంబొంది యలరువారు.
కొమరితఁగఁజూచు మాయత్త కూర్మిమీర
కూతుఁగాజూచు మామామ ప్రీతితోడ
అక్కభాతినిఁజూచుమా యాడపడుచు
పూజ్యరాలనియెంచుమా బుల్లి మఱఁది.
"కన్నవారలకన్నుల కఱవుదీర
విన్నవారలవీనుల విందుగాఁగ"
నడచుకూతునిఁగన్న యా నందమునను
మురియుచుందురు తలిదండ్రు లరయుచుండి.
ఆయురారోగ్యభాగ్యము లమరుచుండ
పుత్రపుత్రికలంగాంచి ధాత్రినెపుడు
శ్రీలఁజెన్నందనెప్పు డాశీస్సులీయ
నాదు భాగ్యంబుఁగొనియాడ నాతరంబె.

బులుసు శారద.

# కుంతి

" ఉ. సంతసమింత లేదు, మృగశాపవశంబునఁ బాండుభూవిభుం
డంతమునొందియుండ మిముసర్భకులంగొనివచ్చి కాంక్షతో
నింతలవారిగాఁబెనిచె నెన్నడు సౌఖ్యముపట్టు గానదీ
గొంతి యనేకదుఃఖములఁ గుందుచునుండును భాగ్యమెట్టిదో? "

(భాగవతము)

భీష్ముడు కుంతి విషయము చక్కగ నెరిగినవాడగుటచే పైరీతి నుడివినాడు. ఎన్నడు సౌఖ్యము పట్టు కానలేదని చింతిల్లినాడు.

నిజమే, భీష్ముడే కాదు, కుంతి చరిత్రము ఎవ్వరువినినను పైరీతి తలపకమానరు.

కుంతి సుకుమారి, రాజపుత్రి, వీరమాత. ఉచితజ్ఞురాలు. ఏమైననేమి. ఆమె సుఖమునకు నోచలేదు. కష్టములకే జనించిన కాంత.

పాపము కుంతి సుగుణసంపన్నయే. సుగుణములని పెద్దలు చెప్పుకొను గుణములన్నియు కుంతికిగలవు.

ఆమె బాల్యప్రాయముననే కోపముయొక్క అవతారమగు దుర్వాసుని మెప్పించి వలసిన ఏదైవమునైనను ప్రత్యక్షము కావించుకొను వరమును పడసినది. ఆ దేవతలచే పుత్రులను పడయుటకుగూడా ఆమె హక్కును పడసినది.

కుంతి జన్మించినది యాదవరాజు ఇంట. పెరిగినది కుంతిభోజు నింట. చెట్టపట్టినది భరతకులాలంకారమగు పాండు నృపాలుని. ప్రసవించినది త్రిలోకములు జయించిన పరాక్రమవంతుల యుధిష్ఠిర భీమార్జునాది ప్రఖ్యాత పురుషులగు పాండవులను. సంబంధ బాంధవ్యములు పరమాత్ముడగు కృష్ణునితో. కుంతి శ్రీ కృష్ణుని మేనత్త.

ఇట్టి యువతికి సంతసములేని జీవనము అని విన్న ఎవరు ఖిన్నులుకారు? ఎటువంటివారైనను విధిని తప్పింపలేరుకదా?

వైధవ్యము, దారిద్ర్యము, బంధుజనవిరోధము, పుత్రవియోగము ఇవన్నియు కుంతి యనుభవించినది. పై పేర్కొనిన ప్రతియొకటియు భరింపరానిదే. అట్టిచో అన్నియు కూడిన చెప్పవలయునా? అవన్నియు కుంతిపై పడినవి. పాప మా సాధ్వి అన్నియు భరించినది. మహాయిల్లాలు, కర్ణుని జన్మరహస్యము ఆమె భరించలేక పోయెను. ఆవ్యథ ఆమె బాలికగ నున్నపుడే ప్రబలించెను.

దుర్వాసుని వరము పరీక్షింపగోరి అతడుపదేశించిన మంత్రమును పఠింపగోరి గంగలో స్నానముచేసెను. ఆమెకు ఏదైవమును పిలువవలయునో తోచలేదు. ఎదుట సూర్యభగవానుడు ప్రకాశమానమై వెలుగుచుండెను. ఆమె ఆ నీరజాప్తుని ప్రార్థించి మంత్రము పఠింప కర్మసాక్షియగు ఆదిత్యుడు ప్రత్యక్షమై కుంతికి తనవలెనే ప్రకాశించుచున్న సహజకవచకుండలధారియగు పుత్రు నొసగెను.

కుంతి భయముతో గడగడ వడక నెందలిడెను. పాప మామె అవివాహిత. ఈబాలుని ఆమె ఏమి చేయును? ఆమె భాస్కరుని పదములకెరగి 'దేవా! నన్ను మన్నింపుము. నే నీ శిశువును ఏమిచేయుదును. నేను నిజముగ పుత్రాభిలాషిని కాను. అవివేకినై బాల్యచాపల్యమున ముని మంత్రబలమును పరీక్షింప దలచితిని. అంతియేకాని నే నే పాపమెరుగను. మీదుమిక్కిలి అవివాహితనే. నే నసహాయను. నీరజాప్తా నీ పుత్రుని నీవే తీసుకొను'మని ప్రార్థించెను.

సూర్యుడు 'కుంతీ, మంత్రప్రభావ మమోఘము. ఈ మన పుత్రుడు కుండలముల ధరించి జన్మించినవా డగుటచే 'కర్ణు'డనియే వినుతికెక్కును. ఈ పుత్రుని నేనుమాత్ర మేమిచేయుదును. అవివాహితవని, పుత్రు డుదయించిన ఎట్లని భయపడకుము. నీకు కన్యాత్వము చెడకుండ వరమొసంగెద'నని చెప్పి భాస్కరు డంతర్హితు డయ్యెను.

ఆ మార్తాండునివలెనే భాసిలుచున్న సూర్యపుత్రుని, ఆ శిశువు నేమిచేయుటో కుంతికి తోచలేదు. పాపము, కన్నకడుపు. వెంటకొనిపోయిన జననింద. వదలిపోయిన ఏ ఆరణ్యమృగమైన ఆహారముగ చేసికొనునేమో. యోచించి యోచించి కుంతితన పుత్రుని గంగలో వదలి తాను ఇలు చేరెను.

నాటినుండియే మనోవేదన ఆరంభమాయెను. కష్టము లితరులకు తెల్పిన కొంత తగ్గునేమో. కానీ రహస్యము తెలిపెట్టలేదు కుంతి. కుంతిని లోలోన క్రుంగదీయుచుండెను ఈ కర్ణజననము.

ఇది జరిగిన కొన్నిరోజులకు కుంతి స్వయంవరమున పాండురాజు వివాహమాడెను.

పాండు భూవరుని పట్టపుదేవిగా కుంతి భోగభాగ్యములు ఎన్నియో రోజు లనుభవింపలేదు.

ఏలందురా, పాండురాజు మృగయాసక్తుడు. మృగయాసక్తుడగుటచే వనములయందే వాసముచేయుచుండెను.

వనవిహారాసక్తుడై పాండురా జరణ్యముపట్ట కుంతి మాద్రులిరువురు అతని ననుగమించిరి. వారట్లు వనవాసము చేయుచున్నపుడే పాండురాజు మృగశాపమునకు గురియయ్యెను. శాపోపహతుడైన పిదప రాజు రాజధానికి రానిరాకరించెను. భార్య లిద్దరిని హస్తినాపురికి పంప ప్రయత్నింప కుంతి మాద్రు లొప్పుకొనలేదు. కనుక ముగ్గురు నారచీరలు ధరించి భిక్షలతో కడుపు నిండించుకొనుచు సన్యాసులవలె కాలము గడుపుచుండిరి.

ముని శాపమునకు భయపడి భర్తకు మదనవ్యాకులత కలుగకుండునటులు కుంతి ఎన్నియో విధముల మెలగుచుండెను.

పాండు నృపునికి సంతానకాంక్ష మిక్కుటమయ్యెను. ముని శాపము త్రోయరానిది. తనవలన పుత్రులు కలుగరని తెలిసి పుత్రార్థియై రాజు కుంతిని పరులవలన సంతానము పడయుమని బోధించెను. అట్టిది తప్పు కాదని కుంతికి బోధించెను.

కుంతి ఆలోచించి దుర్వాసుని వరవిషయము భర్తకు తెలియజేసెను. దుర్వాసుడు తన వరము కుంతి కావశ్యకమని యోగదృష్టి నరసియే యొసగెనేమో! ఏలందురా, ఇట్టి వరము ఇక ఎవ్వరికిని యొసగినట్లు మన మెరుగము.

కుంతి పతిశాసనమును తలదాల్చి సమవర్తియగు యముని ధ్యానించి, ధర్మావతారుడగు యుధిష్ఠిరుని, వాయుదేవునివలన మహాబలపరాక్రముడగు భీముని, ఇంద్రునివలన రెండవ ఇంద్రుడో యను అర్జునుని పడసెను.

తాను పడసి తృప్తిపడలేదు. తన సవతికూడా పుత్రార్థియే గదా యని ఆమంత్రమును మాద్రి కుపదేశించెను. కనుక కుంతికి సవతితోడి మాత్సర్యము కూడా లేదని తెలియుచున్నది.

మాద్రి అశ్వినిదేవతలచే నకుల సహదేవుల పడసెను.

కుంతి రాజు విషయమున పడిన జాగ్రత్తయంతయు వృథాయయ్యెను. రాజు మాద్రినికూడి మరణించెను. భార్యలు సహగమనము చేయతలచిరి. సవతులిద్దరును చితినెక్కిన పాండవులు అనాథులగుదురని యోచించి బిడ్డల కుంతికి నప్పగించి రాజు మృతికి కారణమైన మాద్రి రాజుతో మరణించెను.

పాండవులను వెంటనిడుకొని కుంతి హస్తిపురి ప్రవేశించెను. 'మగని కాలమున కష్టపడిన మగువ సుతుల కాలమున సుఖము చెందు'నని సామెత. ఈ పలుకులు కుంతియెడ పనికిరాలేదు. ఏలయన పతితో అడవులందే, పాండవులతోను అడవులనే.

కురుపాండవులకు వైరము మెలకెత్తసాగెను. విధవయగు కుంతి బావగారి నిలయమందుండుటచే ఈవైరమామెకు హృదయశల్యమయ్యెను. వారి ఐకమత్యమునకై ఆమె ఎన్నియోవిధముల ప్రయత్నించెను. కుంతి సహితముగా పాండవులను లక్కయింట కాల్ప దుర్యోధనాదులు నిశ్చయించిరి. ఈరహస్యమెరిగి పాండవులును, కుంతియు తప్పించుకొని బ్రాహ్మణవేషధారులై యరణ్యముల తిరుగుచు, ఇడుములు పడుచు అజ్ఞాతవాసము చేయుచుండిరి.

# కుంతి

లాక్షాగృహమందు కుంతి వ్రతముచేసుకొని అనేక దానముల నొసగెను. ఆ దానమందినవారిలో ఒక స్త్రీ తన ఏవురు పుత్రులతో మద్యపానము అమితముగ చేయుటచే ఒడలు తెలియక నిద్రించుచుండి ఆయింట కాలిపోయెను. ఆ ఆర్గురి శవములు చూచి కుంతి తన పుత్రులతో మడిసెనని దుర్యోధనాదులు తలచిరి.

ద్రౌపదిస్వయంవరము కాగానే ద్రుపదుపురమునుండి కుమారులతో హస్తినాపురప్రవేశమొనర్చినది కుంతి. సుతులు అర్ధరాజ్యము పంచుకొనగా కొన్నిరోజులు పుత్రులతో ఉల్లాసముగ కాలము గడిపినది.

అంతలో మాయాద్యూతము సంభవించెను. ఆ జూదమున కౌంతేయులు రాజ్యసర్వస్వము నోడి అరణ్యములకు పోవుచుండ కుంతి వారిని వెంబడింపవలయునని సర్వవిధముల ప్రయత్నించెను.

పలువురు పెద్దలు కుంతి జరాభారముచే క్రుంగియున్నదనియు, ఆమె సుఖోచితురాలనియు ఇక అరణ్యవాసమున కామె తగదనియు బోధించి ఆమెను నిలిపివేసిరి.

ఆమె వైరులయింటనుండ ఇష్టపడలేదు. విదురుడప్పుడామెను తన యింటికి తీసుకొనిపోయెను. పాండవులరణ్యాజ్ఞాతవాసములు చేసినన్ని వత్సరములు విదురు నింట జ్ఞాతులొసగు అన్నమును విష సమానమైనదానిని భుజించుచు కాలము గడిపినది కుంతి. ప్రేమలేని కూడు పిండంపుకూడను సామెత యున్నది. మనస్సు పాండవులందుంచి మేను విదురు నింటచేర్చి, పగతురన్నము దినుచు, పుత్రులకు దూరమై వారి వియోగబాధ, వైధవ్యదుఃఖమును భరించుచుండెను.

సూర్యపుత్రుని సూతపుత్రుడని జనులు పిలిచినపుడెల్ల ఆమె హృదయమున వేయి తేళ్లు కుట్టినట్లగుచుండెను. ఇప్పుడు మనము ఎవరైన అమితముగ దానమిచ్చుచున్న 'దానకర్ణుడు' అందుము.

కర్ణుడు మహోదాత. పరశురాముని శిష్యుడు. ఆకర్ణుడు తన పుత్రుడని చెప్పుకొన కుంతి నోచుకొనలేదు. రాజపుత్రులు సూతపుత్రుడని కర్ణుని నిందించినపుడు ఆమె కడుపు చుమ్మలు చుట్టుకపోవుచుండెడిది. రహస్యము వెలిపెట్ట సాహసము చాలలేదు. కర్ణ దర్జునుని చంపను, అర్జునుడు కర్ణుని వధింపను ప్రతిజ్ఞపట్టిరి. ఈ అన్యోన్య వధ ఆమెను బాధపెట్టుచుండెను. కర్ణుని జన్మవృత్తాంత మెరుగని ధర్మరాజాదులకు తెలుపుటకన్న ఎరిగిన కర్ణునే వశపరచుకొని అన్యోన్యవధ మాన్పింతమని కుంతి కర్ణునిచేరి కర్ణుని పాండవులతో కలియుమని బోధించెను. రాజభక్తిపరుడగు కర్ణుడు పాండవులచేర నిష్టపడక 'అమ్మా, నీ కడుపున పుట్టిన నేను నమ్మిన రాజునకు ద్రోహమొనర్తునా? నన్ను పోషించు దుర్యోధనుడు నేను అర్జునుని చంపుదునని నమ్మియున్నాడు. నేను నా తమ్ముల నలువురిని వదిలిపెట్టెదను. చిక్కినను చంపను. అర్జునుని నే చంపిన నాతోడను, అర్జునుడు నన్ను చంపిన అతనితోడను నీకు ఐదుగురు సుతులుందురు. అంతియేకాని కర్ణార్జునులకు చెలిమియు, నీ కార్వురు పుత్రులు నుండరు' యని చెప్పి నమస్కరించెను.

కుంతి వైఉద్యమమున సఫలీకృత కాలేదు. కృష్ణునిచే చెప్పించినది. దానివలనను లాభము కలుగలేదు.

పాప మామె ఏమి చేయగలదు? యుద్ధమున కర్ణుడు మరణించి ఆమెకు పుత్రశోకము దెచ్చిపెట్టెను. కర్ణునికై గట్టిగ ఏడ్చుటకుకూడా ధైర్యము చాలదు.

ఆమె ధర్మజుని చూచి 'పుత్రా, కర్ణుడు మీయన్న. అతనికి ఉదకము విడువు'డని చెప్ప ధర్మజుడు నిశ్చేష్టుడయ్యెను. 'అమ్మా, ఈ రహస్య మిన్నిదినములు ఎట్లు దాచితివి. మాలో ఒకడైన రాజ్య మనుభవించుచున్నాడని తెలిసిన ఈ యుద్ధము మేము చేసియేయుండము. నేటినుండియు ఆడువారినోట మాట నిలువకుండునుగాక'యని శపించెను. స్త్రీలోకమునకు పైశాపము బాగుగా తగిలినది. మన మీ శాపబద్ధులమైనది కుంతి వలననే. నాటినుండి కుంతిని పుత్రులుకూడ దూరుచుండిరి.

ఆహా! యదువర్యుని ముద్దుబిడ్డ, కురువంశాలంకారుని పట్టమహిషి, ప్రపంచవిఖ్యాతులగు పాండవుల జనని, పరమాత్ముడగు కృష్ణుని మేనత్తకు రాదగిన ఇక్కట్లా ఇవి?

కుంతికి రానికష్ట మేమైనయున్నదా? ఇన్ని కష్టములపడిన కుంతిని తలచి ఎవరు విచారింపరు?

# నాదబ్రహ్మోపాసన

ఆంధ్రమహిళాగానసభ, రాజమహేంద్రవరము

'కృష్ణకుమారి'

"......వరదాం సంగీతమాతృకాం వన్దే". భగవానుని యిచ్ఛ యేమో యించుకంతేని యెఱుంగ గాదు. కాని ప్రతివిషయమునకును స్త్రీని కారణభూతగా సృష్టించినాఁడు. ప్రపంచ సృష్టికాద్య ప్రకృతి. ఆమెయు స్త్రీరూపిణియేయని పెద్దలచే నిశ్చితమైనది. "ప్రకృతిః కర్త్రీ" అని ప్రమాణోక్తి. సృష్టిక్రమ సంకేతప్రకారము గానమునకును, చదువుల కల్పవల్లి, నలువరాణియే తల్లియైనది. గానమునకు సరస్వతియే అధిష్ఠానదైవము. వాణీ దైవమై వఱలుచుండ పరమపావనమగు ప్రణవమునుండి భువి నవతరించి, సామవేదసంజనితసంచారమై రాణకెక్కినది గానము!

నిండుభక్తికతమునను, నిండురక్తివశమునను, ఏకాంతమున భజనముచేసిన కొలఁదియు, ఆత్మ వివశమై పరమాత్మసన్నిధానమున ఆనందనృత్తమొనర్చును. ఆ యానందనర్తనమే విగళితాన్య విషయికమగు నా యింద్రియమూర్ఛనమే, తన్మయావస్థ. అట్టివారి ప్రోలనే భగవంతుడు సాక్షాత్కారమొనర్చును. భగవానుని సైతము వలచి వలపింపఁజేయునట్టి, సొక్కి సోలఁజేయునట్టి మహితసుందరగానము మహిళలపాలిటి సొమ్ముగుటది మా మహాభాగ్యము.

పురుషులు తపస్సుచేసినను గడింపలేని కంఠమాధుర్య మాఁడువారికి సహజముగనుండును. అదిరే! జన్మమునకో స్త్రీగణముచేసిన పుణ్యావాప్తి! స్త్రీలలోనైన నొకించుక పేలవముగనుండు కంఠమును పురుషకంఠమని హేళనచేయుదురు. పురుషులలో శ్రుతిపేయమగు గళరవమును స్త్రీకంఠమని కీర్తనచేయుదురు.

ప్రయత్నలోపముననో, ప్రబల ప్రోత్సాహము లేకపోవుటచేతనో, కాని యీనడుమ స్త్రీలు గానమున కపరిచితలైనారు. పురుషులాకళయందు ప్రబలులైరి. ఇపుడిపుడు తలలెత్తుచున్న గానసంస్థలును పురుషులకే ప్రోత్సాహ మొసగుచున్నవి. ఆదరణలేకపోవుటచే స్త్రీల కడనుండి గానము విడియాకులు పుచ్చుకొన సంసిద్ధమగుచున్నది. అట్టియెడ మహిళలయాజమాన్యమున నొకగాన సంస్థ నడుపబడుచుండుచో గాయనీమణులకు సాహాసముగ ప్రోత్సాహకరముగ నుండునను నుద్దేశముతో శ్రీమతి నాళము సుశీలమ్మ గారు 1934 జనవరి 18 వ తేదీనాఁడు త్యాగరాయ వర్ధంతులలో 'ఆంధ్రమహిళా గాన

సభ' యనుపేర రాజమహేంద్రవరమున గానకళారూపిణియగు సరస్వతీమూర్తి నారాధింప సమకట్టిరి. తొలివత్సరమున దీనియందెవరును కూడిరాలేదు. కాని మలి వత్సరమునుండి దీని మహిమ కనబడసాగి నది.

హిందూదేశమున నిట్టి సంస్థలేదని బొంబాయి దేశస్థులొకరు వ్రాయుచు దీనిని ప్రోత్సాహపఱచిరి. అటనుండి పురస్త్రీలును పూనుకొని దీనికొక కమిటీనేర్పఱచి ఉత్సాహముతో పనిచేయ నారంభించిరి. నాఁటి నుండి యీసభ పున్నమిరేతిరులలో నెల బాలుని మాడ్కి ఏఁటికేఁడు పెంపుగాంచు చున్నది.

సంగీతము నేర్చుచున్న పసిబాలలకు ప్రోత్సాహమొసఁగి చేయూఁత నొసఁగు టయు, వచ్చి మఱచిన స్త్రీలకు జ్ఞాపకముఁ జేసి నల్వురిలో వారికి ప్రశస్తిదెచ్చుటయు నీసభయొక్క ముఖ్యోద్దేశములై యున్నవి. ఈ సభాస్థాపకురాలగు శ్రీమతి నాళము సుశీలమ్మగారు తమ యింట నీసభ కనుబంధముగ వేఱుగ నొక గానపాఠశాల నేర్పఱచి బాలికల కుచితముగ గానము నేర్పు చున్నారు. అదిమొద లీ సభవారి పాలకత్వమున జీగీయమానముగ నిర్వహింపబడు చున్నది. ప్రతివత్సరము మూడునాలుగు దినములు త్యాగరాయవర్ధంతులలో నీసభ జరుపబడుచుండును. అందు సుమారు ముప్పదినలుపదిమంది బాలికలు స్త్రీలు తమ గానకళాకౌశలము నీసభయందు ప్రదర్శించి సభ్యులాంధ్రను పరవశుల నొనర్చుచుందురు. తొల్లటియేఁడు శ్రీయుత మామిడన్న నారాయణరావు శ్రీయుత నాళము కృష్ణరావు గార్లు ఇందు పాడినవారికి రజతపతకములను దొడిగి యీ సభాబాల ముద్దుమురిపెము లందీర్చిరి. తరువాత శ్రీ మోతే కృష్ణరావు, శ్రీయుత అదుర్తి భాస్కరమ్మగారలు రజతపాత్ర, రజతచిత్రములనిచ్చి యీబాల కందము గూర్చిరి. ఈసభ కధ్యక్షిణిగనున్న శ్రీమతి నాళము సుశీలమ్మగారు నూరు రూపాయిలను జదివించిరి. ఇంతియకాక శ్రీయుత మోతే గంగరాజుగారు 25-0-0లను శ్రీయుతులు పోలిశెట్టి హనుమయ్యగుప్త, పైండా శ్రీరామకృష్ణయ్యగారలు ఇరువదేసి రూప్యములనిచ్చియు నీసభ నాదరించి యున్నారు. ఇంకను పెక్కండ్రుస్త్రీలు పదులు, పదునైదులు, నిచ్చి యీసభ కృతజ్ఞతకుఁ బాత్రులైనారు.

మొన్న జనవరి 21,22,23,24 తేదీలలో నీసభ పంచమ వార్షికోత్సవము నాళము వారి సత్రమున శ్రీమతి సీతంసెట్టి సుందరమ్మగారి యాధిపత్యమున కన్నులపండువుగ, వీనులవిందుగ నెఱవేర్పఁబడినది. మొదటియేఁడు మొలబిళ్లలతోను, తరువాత చిత్రములతో నాడుకొంటతోను, వెండి గ్లాసులతో పానముసేయుటయే నేర్చి అంతతో తనివినినిన ఈసభాసరస్వతి యీ యేఁడు స్వర్ణపతకమును సైతము ధరించి తన యీడునకుఁదగిన పెంపుగనఁబఱచి మీఁదటికి నింక నెంత సొబగుగుల్కునో

యని చూపఱులయు, వినువారలయు మనస్సు లీరిక లెత్తుకోరికలతో క్రేళ్లురక తరితియ్యము లొనర్చినది.

ఈ యేఁడీ సభయందు సుమారు ముప్పది నలువదిమంది స్త్రీలు బాలికలు పాల్గొని సభాకార్యక్రమమును ఉత్సాహముగ సాఁగించినారు. అందు ముడింబి సీతమ్మ, భాగవతుల లక్ష్మీనరసమ్మగార్ల సంగీతము వన్నెవాసి కెక్కినది. ఫిడేలు వాద్యమున, పీఠికాపుర వాస్తవ్యులు శ్రీనివాసపరీక్షాగారి కుమారీరత్నము శ్రీమతి సరోజినిదేవిగారు తమ అసమాన నైపుణిం బ్రదర్శించి మిన్నయని పొగడ్తకెక్కిరి. ఇంకను పల్వురు తమ గాన ప్రదర్శనములచే సభ్యుల నానంద పఱిచిరి. తదుపరి నడిపల్లి వెంకటరమణ, గాడిచెర్ల లలిత (7 ఏండ్లబాలిక) యను పూవ వయస్సు పాప లుల్లము లుల్లసిల్లునటుల ముద్దులు గుల్కునట్లు భరత నృత్తమొనర్చి హాయి గూర్చిరి.

ఈసభ రాజమందిర రాణుల కెంతేని గానమున ప్రోత్సాహ మొసఁగుచున్నది. ఈసభ పుట్టినవెన్క నింటింట గానము వెలసినది. అటుకలపైనెక్కి బూజువట్టిన వీణ, ఫిడేలుమున్నగు వాద్యములు శుభ్రపడి రంగమునెక్కి "రాలగరగించు విమల గాంధర్వము"ను వెలయించుచున్నవి. ఈ సభలో పాడి మెప్పు పొందవలయునను నుద్దేశముతో చిటివయసు బాలికలు తమ తలిదండ్రులతో పోరి యిండ్లకడ సంగీతము చెప్పించుకొనుచు సభలలో అనాహూతలయ్యు రంగమెక్కి "తధిగిణితోం"అను తానమానములతో అవ్యక్త మధుర గానము లొనర్చుచున్నారు. స్త్రీలలో పసికందులలో ఇట్టి అపూర్వ సంచలనము, క్రేళ్లురుకు నుత్సాహము కల్గించిన దీసభయే యనిన నతిశయోక్తి యావంతయు లేదు.

ఈ వత్సరము మోతే సుబ్బలక్ష్మిగారి జ్ఞాపకార్థమొసఁగఁబడిన శ్రీయుత మోతే కృష్ణరావుగారి రజత పాత్ర పాటలయందుత్తమురాలగు శ్రీయుత ముడింబి సీతమ్మగారి కొసఁగఁబడినది. గాత్రముపాటయందే రెండవ బహుమానము శ్రీయుత ఎస్. పినాకపాణిగారిది శ్రీమతి శ్రీపాద సుబ్బలక్ష్మిగారి కొసంగఁబడినది. శ్రీమతి సరోజనీదేవిగారిని ప్రత్యేకముగ సంఘము వారొక వెండికప్పునిచ్చి బహూకరించిరి. ఫిడేలువాద్యమున శ్రీమతి విష్ణువజ్ఝల వేంకటరత్నావతిగారిని శ్రీయుత నాగవరపు బుచ్చి అబ్బాయిగారి రజతపాత్రముతో సత్కరించిరి. వివిధ వాద్య సమ్మేళనమొనర్చి గాన మొనర్చిన (ఆర్కెస్ట్రా) శ్రీ మైసూరు లక్ష్మణరావుగారి శిష్యగణమునకు శ్రీయుత కొమ్మూరి బాల బ్రహ్మనందదాసుగారొక సంచార రజతపాత్ర (రోలింగ్ కప్) బహుమానమొసంగిరి. వీణా వాద్యమున ప్రథమురాలిగా నిర్ణయింపబడిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ శ్రీయుత దేవత శ్రీరామమూర్తిగారి బంగారుపతకముచే బాగుగా బహూకరింపబడిరి. నృత్య మొనర్చిన బాలిక

లిద్దరకు నొక గానకళాభిమాని రెండు చిన్న రజతపాత్రల నొసఁగిరి.

"ఇంతవఱకు ఆర్థికస్థితి ననుసరించి యేటి కొక్క సమావేశము జరుపుటతోడనే తృప్తి నందుచున్నాము. ఏఁటిపొడుగునను నెలకొక గానసభ జరుపవలెనని లోపల నెంతయో తమకము కలదు. ఇప్పటి కిందు 92 చందాదారు రాంధ్రుకలరు. వీరుగాక సుమారు 20 మంది బహుమతుల నొసఁగిరి. కొందఱింకను బహుమతుల నియ్యఁదలఁచి యున్నారు. మా పున్నెము పూర్తియగుచో దీని కీయేఁడు తలఁచిన దానికంటె ఇమ్మడిగ డబ్బు రావచ్చును.

ఇంతియకాక, యీసభ అఖిలాంధ్రులకు వర్తించు సభ. ఈ సభవలని ప్రబోధ మొక్క రాజమందిరమునకే కాక అఖిలాంధ్రమండలములకును లభించునట్లు చేయవలయునని మా యుద్దేశము. కావున గానకళయందభిరుచి కలవారీ సభను తమ నగరుల కాహ్వానించి యచట జరుపుకొనవచ్చును. ఇప్పటికి పొరుగూరివారి నిక్కడికిపిలిచి పాడించుటతోడను, పొరుగూరివారిందు పాడుటతోడను దమతమ కర్తవ్యములు నెఱవేరినట్లెంచరాదు. ఈసభను తమ యూళ్లలో సైతము జరిపి గానకళకు ప్రచారము ప్రబోధము కల్గింతురు గాత"మని కార్యదర్శి విజ్ఞాపనము.

ఈ సభోద్దేశము లెంతయు ఉదారములై యున్నవి.

అందఱు నిందు చందాదారు రాంధ్రుసగఁ జేరియు, పురుషులు విరాళముల నిచ్చియు నీ సభాబాలను పోషింతురుగాత.

రాజకప్పము గైకొనియు నాథనముసే తిరిగి వెచ్చించి ప్రజలను సౌఖ్యపెట్టునటుల ఏటికొకరూపిక నొసఁగి దీనివలనగల్గు అమూల్యమును, శాశ్వతమునునగు నానందమును ప్రజలు చూరగొందురు గాక.

ఇటులే మితిలేని బహుమానముల నందుచు, చిన్నారిపాయముననే తనవచ్చీరాని తొక్కుపలుకులతోడనే రసికజనుల హృదయముల నలరించుచు వారియమోఘాశీస్సుల నందుచున్న ఈ సుధామయ రసతరంగిణి చిరము జీవించునట్లు ఏకేశుఁడను గ్రహించునుగాక.



"అబ్బాయీ! ఏంచేస్తున్నావ్ ఇంతసేపటినుంచీ?"

"అన్నం తింటున్నానే—"

"నాయనా! కొంచం తక్కువగా తినరా. ఈవేళ నీకు ముక్కులో ఏదో ఆపరేట్ చేయాలి, అది కాళీగావుండాలన్నాడు డాక్టరు."

# పిల్లికి చెరలాటము–ఎలుకకు ప్రాణసంకటము

## శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారు

సీత దొడ్డివసారలో కాఫీ కాస్తోంది. రామారావు కచేరీహాల్లో వాలుకుర్చీలో పడుకున్నాడు. ఇంతలో పోస్టుప్యూన్ వచ్చి ఉత్తరములు పత్రికలు అందిచ్చాడు రామారావుకు. అన్నీ వరసనే విప్పిచూచి ఒకసంచిక చేతబట్టుకుని చూస్తూ పిలిచాడు సీతను.

బంట్రోతువచ్చి ఉత్తరములు ఇవ్వడం చూచింది సీత. ఇంతలో భర్తపిలిచేసరికి ఏదో తనపుట్టింటినుంచి ఉత్తరం వచ్చింది కాబోలు అనుకుని వడివడిగావచ్చి 'ఏమండి! మా తమ్ముడు ఉత్తరం వ్రాశాడా' అన్నది సంతోషంగా.

'ఉత్తరములేమి రాలేదు. ఈ సంచికమీది బొమ్మ చూడు' అన్నాడు రామారావు నవ్వుతూ.

'ఇందుకేనా పిలిచింది? ఇంకా ఏదన్నా ఉత్తరమో లేక పత్రికలో ఏదన్నా గొప్పసంగతులున్నవో అనుకున్నాను. ఏమున్నది చూసేందుకు?' అన్నది చిన్నబోయిన ముఖంతో సీత.

'సరే కాఫీతీసుకురా తరువాత మాట్లాడుదాం' అన్నాడు రామారావు.

కాఫీతెచ్చి చల్లార్చిఇస్తున్నదిగాని పత్రికమీది చిత్రపటము సీత మనస్సును కలచివేస్తూనే వున్నది.

'సీతా! ఎందుకల్లా కూర్చున్నావు. ఏదో ఆలోచిస్తున్నట్లున్నావే? కాఫీ త్రాగునీవుకూడా' అని తాను త్రాగి కప్పు అందిచ్చాడు సీతకు.

'వేరే ఆలోచనేమీ లేదు. ఆరోజు కారోజు స్త్రీలు ఎంత చులకదనముగా ఎంత హేయముగా చూడబడుతున్నారు అని ఆలోచిస్తున్నాను గాని వేరే యేమీ లేదు. ఇవ్వాళ నాకు వికారంగావున్నది. కాఫీ అక్కరలేదు' అని కప్పు అవతలకుత్రోసి గోడకు చేరబడి కూర్చున్నది సీత.

'సీతా! ఎవ్వరో చిత్రపటము వ్రాసినారని నామీద అలిగి కాఫీత్రాగకపోతే ఏంలాభం? పురుషులంతా వక్కటేకదా అని కాబోలు నీ అభిప్రాయం?' అన్నాడు రామారావు కొంచం కోపసూచకంగా.

'ఎవరో వ్రాసిన వాళ్లమీద కోపంగావుంటే మీకెందుకూ కోపం? నేనేమి అనందే?'

'మా పురుషుడే కనుక నాకు కొంచం కోపం వస్తుంది.'

'అల్లాగా? ఇల్లాంటి బొమ్మలు వేశారంటేనే మీకు కోపంవస్తూంటే? ఈ బొమ్మలు చూస్తూంటే మా కెల్లావుండొచ్చునో మీరే చెప్పండి? పూర్వకాలము స్త్రీలు ఎంత గౌరవముగా చూడబడ్డారో ఎంత అమూల్యమైన వస్తువుగా వాడబడ్డారో ఇప్పుడు అంత చులకదనముగావున్నారు పురుషుల కలముక్రింద స్త్రీలు. ఈ వ్రాతలు, ఈ చిత్తరువులు చూస్తూవుంటే మహారణ్యములో అగ్నిలేకుండా వాటంతటవే దహించుకొనిపోయే వృక్షాల్లాగవున్నాయి మా స్త్రీల హృదయాలు. స్త్రీలు కోమలహృదయులు. వెన్నవంటి మనస్సుకలవారు. వెన్న పొయ్యిసెగను పెట్టితే కరగినట్లుగా మీ కలంపోటుల సెగలకు కరగిపోతున్నవి. స్త్రీలు ఈ చిత్తరువులను చూచి తలలు వంచుచున్నారు' అన్నది సీత నేలవంక చూస్తూ.

'ఐతే! సీతా! నేను వక్కమాట అడుగుతాను కోపము రాదుగదా?'

'కోపమెందుకూ? మాకు కోపమొస్తుంది అనే గౌరవమైనాయాదలు మీకు మాయందుంటే ఈ పత్రికలను ఇంతదూరము తెచ్చి వృద్ధిచేస్తారా?' అన్నది సీత.

'ఎన్నడూ ఎక్కువగా మాట్లాడి ఎరుగని నీవు ఇంత తీవ్రముగా మాటాడుటకు వీటివలన మీకు

కలిగిన నష్టమేమున్నది?' అన్నాడు రామారావు నవ్వుతూ.

'మీకు సంతోషము; మాకు దుఃఖము. నష్టము గాకేమి? గౌరవనష్టముకంటె ఇంకేమి నష్టము కావాలి? డబ్బు నష్టమైతే మళ్లీ సంపాదించుకో వచ్చు. గౌరవం నష్టమైతే ఎల్లావస్తుంది? అనాది నుండి భారతస్త్రీలు ఎంత గౌరవముగా తమ శీలమును కాపాడుకొనుచున్నది మీకెల్లరకు తెలిసిన విషయమే. అట్టిసంతతికి చెందిన మాయెదుట నేడు ఈవిధముగా వస్త్రవిహీనములగు చిత్తరువులను వ్రాసి ప్రదర్శిస్తూంటే మా హృదయాలు ఎంత ఖేదపడుతున్నాయో మీ కేంతెలుస్తుంది? సీతా, సావిత్రి, అనసూయ, దమయంతి, ద్రౌపది మున్నగు పతివ్రతామతల్లులు తమ శీలముకొరకు ఎన్నో కష్టములు అనుభవించిరి. పద్మిని, రాణీసంయుక్త మున్నగు రాజపుత్రస్త్రీలు ప్రాణములు సైతము కోల్పోయినది జగత్ప్రసిద్ధము. అట్టి పూజనీయమగు స్త్రీమూర్తిని నవీనకాలపు చిత్తరువులవల్లను, వ్రాతలవల్లను ఎట్లు హేయము చేస్తున్నారు చూడండి. ఇంత శోచనీయము ఇంకొకటి కలదా? మా స్త్రీలలోకూడా ఎంతమందియో కథకులున్నారు; ఉపన్యాసకులున్నారు; కవయిత్రులున్నారు; చిత్రకళానిపుణులున్నారు. ఎవ్వరైనా ఎప్పుడైనా పరుల నగౌరవపరచుట ఏగ్రంథములలోనైనా ఏ పత్రికలలోనైనా చూచారా చెప్పండి' అన్నది సీత గద్గదకకంఠముతో.

'సీతా! నీవు ఇంత కసివెళ్లపోయుచున్నావు గాని నేను చెప్పిన బొమ్మలు మన దేశపువి కావు. మీరుకూడా నవీనులే కదా పత్రికనుమాత్రము నవీనం అని ఆక్షేపించుటెందుకు? మీమీద వ్రాశామా అంటావే? వ్రాయరాదూ చూద్దాం' అన్నాడు రామారావు గరువంగా.

'అంత గరువంగా మాట్లాడుతున్నారు మేము వ్రాయముకదా అని కాబోలు? ఇటువంటి హేయపు ప్రసంగముతో మాకు పనిలేదు. మేము నవీనులమైతే కావచ్చుగాని మా హృదయాలుమాత్రం నవీనములు కావు. స్త్రీ నవీనగాని పూర్వాచారపరాయణి గాని తన ధర్మమును తన శీలమును తన భక్తిని విడనాడదు.

'నీ వెన్నడు ఈవిధముగా మాట్లాడలేదంటారు. ఎప్పుడు పోటిచేదలాగ మాట్లాడితే యేంలాభం? సమయం వచ్చినప్పుడు మితముగా మాట్లాడినంతమాత్రమున మాకేమి తెలియదనుకుంటున్నారు కాబోలు? సమయంవస్తే మేముగూడ రాజ్యాంగవిషయాల్లోగాని, ఉద్యోగాల విషయాల్లో గాని, రణరంగములలోగాని మీకుతీసిపోము. మితముగా మాట్లాడినంతమాత్రమున స్త్రీకి ఒక వ్యక్తిత్వముకూడా లేదని తలంచి ఆటవస్తువుగా భావిస్తున్నారు కాబోలు. స్త్రీయొక్క ఆశయములు, తెలివితేటలు గౌరవమరియాదలు నిప్పుమీద నివురుకప్పిన చందముగావుంటాయి గాని స్త్రీ అబల కానేరదు. అవసరము వచ్చినప్పుడు స్త్రీయొక్క తెలివితేటలు కార్యశూరత నుపయోగించును గాని అనవసరప్రసంగము కలుగచేసుకునే వ్యక్తికాదు స్త్రీ.

'ఆ స్త్రీలు మన దేశపువారు కారు అని చెప్పినంత మాత్రమున మా హృదయాలు శాంతించునా? ఏ దేశపువారైననేమి. జాతిఅంతయు ఒక్కటేకదా? ఆబొమ్మలు చూచి నేను సహించలేనండీ' అని అక్కడనుంచి లేచి వెళ్లింది సీత.

'సీతా! ఈ కోపమిమ్మీద వంట ఆలస్యంచేసేవు సుమా నేను అర్జంటుగా ఆఫీసు వెళ్లాలి' అన్నాడు రామారావు.

'మా కల్లాటివేషా లేమీలేవు. కోపమొచ్చి వంట ఆలశ్యం చెయ్యడం, మాట్లాడకపోవడం. ఇల్లాంటి అవగుణాలు మాదగ్గరుంటె యొక్కటేమున్నదీ? మాకు ఎల్లప్పుడు వక్కటె నోరు, వక్కటె మనస్సు' అన్నది సీత స్నానానికి వెళ్లుతూ.

సీత ఆత్మాభిమానం కలది. పతిభక్తి దైవభక్తి ఆమె ముఖ్యవ్రతాలు. ఎన్నడు భర్తకు ఎదురు జవాబుచెప్పి ఎరుగదు. ఇప్పుడు జాతివిషయమైన గర్షణలో మాట్లాడక తప్పిందికాదు. ఆమె మనస్సే ఆమెను తొందరపెట్టింది. తొందరపడి ఏమి మాట్లాడాము అనుకుంది. సమయం వచ్చినప్పుడు మాట్లాడకపోతే ఎల్లాగా అని తనకుతానే సమాధానపరచుకుంది.

౨

రామారావు చాలా తెలివికలవాడు. తనఉద్యోగమేమో తనపనేమోకాని ఒకరిజోలి ఒకరిప్రస్తావన కలుగజేసుకోనేవాడు కాదు. బాగా చదువుకున్నవాడు కావడంచేత ఎప్పుడన్నా తనభావాలు తెలిబుచ్చేకొరకు ఏదోఒక వ్యాసముగావ్రాస్తూవుంటాడు గాని ఒక వ్యక్తినిగురించిగాని వ్రాసేవాడు కాదు. సమయం వచ్చిందిగనుక కొంచంసేపు తమాషాకు భార్యతోఘర్షణగా మాట్లాడటమేగాని ఆయన మనస్సులో స్త్రీవిషయాన్నిగురించి నిశ్చితమైన ద్వేషమేమీలేదు.

సీత! వంటచేస్తున్నదిగాని ఆమెమనస్సులో చిత్తరువులనుగురించి ఆలోచిస్తూనేవున్నది. వస్త్రవిహీనములగు బొమ్మలు ఆమె కన్నులఎదుట కనిపించినట్లేవున్నది ఆమెమనస్సుకు.

'ఇవ్వాళ సమాజములో ఈచిత్తరువులను ఈ వ్రాతలనుగురించి మామెంబర్లందరును ఆలోచించి ఒక తీర్మానముచేసి పత్రికాధిపతులకు తెలియజేయా' లనుకున్నది. వంటతయారుచేసి భర్తరాక కెదురు చూస్తున్నది సీత.

'సీతా! పదిన్నరైంది వంటైందా ?' అన్నాడు రామారావు రెండుచేతులూ దరవాజపట్టుకు తొంగి చూస్తూ.

'వంటైచాలాసేపైంది. మీరాక కెదురుచూస్తున్నాను' అన్నది సీత ఎదురుగావచ్చి.

'వంటైతే నీదేవతార్చనైందా ?'

'నాకేమి దేవతార్చన ?'

'ఏదో గంటవాయిస్తావుగా అందుకని అన్నాను' అని పకాపకానవ్వాడు రామారావు.

'ఇందుకే మీకు వినపడకుండా చేస్తాను. దేవుడంటె అంతనవ్వెందుకు చెప్పండి ?' అన్నది సీత దీనంగా.

'బాబోయి దేవుణ్ణంటె కళ్లుపోతాయని నాకు మట్టుకు తెలియదూ? నీవే మరిచిపోతావని జ్ఞాపకము చేశాను. దేవుడంటె నాకు ప్రేమే.'

'ప్రేమవుండి మనమేం పెడుతున్నాం దేవుడికి? మాపులు వారివి మేపులు మనవి అని పెద్దలు చెప్పినట్లు దేవుడికేం కర్చుపెడుతున్నాం మనం ?'

సీత కంచము చెంబు పీటా అన్నీ సిద్ధంచేసి వడ్డన పూర్తిచేసింది.

రామారావు స్నానంచేసి పట్టుపంచ కట్టుకుని భోజనానికికూర్చుని సీతముఖమువంక తేరిపారచూచి 'ఏదో ఆలోచిస్తున్నట్లున్నావు ?' అన్నాడు.

'ఏమీలేదు మీరు భోజనంకానియ్యండి.' అన్నది సీత.

భోజనం అవుతూవుంది. 'ఆలోచనేమిటో చెప్పావు కాదేం ?' అన్నాడు రామారావు.

'చెప్పకేమీ ? మీకు చెప్పకుండా ఎల్లాచేస్తాను? ఇవ్వాళ సమాజానికి వెళ్లుతాను కాఫీకి తొందరగా వస్తారా ? అన్నది' సీత బెదురుచూపులతో.

'ఇందుకేనా ఇంతఆలోచన? ఏమెం బెదిరిపోతు అడుగుతున్నావు. కాఫీకి రావడానికి తీరుబడి కాదు. హోటల్లో పుచ్చుకుంటాను నీఇష్టంవచ్చినప్పుడు వెళ్లు.'

రామారావు భోజనంచేసి వెళ్లిపోయాడు.

గోడనున్న గడియారం మూడుగంటలు కొట్టింది. స్త్రీసమాజానికి సీతే కార్యదర్శి. గనుక మధ్యాహ్నం మూడుగంటలకల్లా మెంబర్లందరికీ నోటీసు పంపింది. తానుకూడా తలదువ్వుకుని ప్రయాణమై వెళ్లింది సమాజానికి. మెంబర్లంతావచ్చి సభచేశారు.

3

'ఏం. సీతా! మీ మీటింగులో ఏమి తీర్మానాలు చేశారో?' అన్నాడు రామారావు.

'మేము ఏంచేస్తే మీకెందుకూ? అంత తొందర పడుతున్నారు?'

'ఏమి లేదు వూరికేనే విందామని'.

'అహా—అదివాదులెండి. తమరుకూడా వ్యాసకర్తలేగనుక అడుగుతున్నారు. లేకపోతే మేమేంచేస్తే మీకెందుకూ? చెప్పండి? మా సమాజంలో ఈవేళ ప్రసంగాలు జరిగినతరువాత నేను చదివినతీర్మానం ఇది. 'పత్రికలు వ్రాయుచున్నవ్రాతలు వేయుచున్న చిత్తరువులు చూచి స్త్రీలహృదయాలు చాలా వేదనపడుచున్నవని ఇక్కాలపు కథకులు చిత్రకారులు తెలుసుకొనవలెనని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

'మఱియు వ్యాసకర్తలూ చిత్రకారులూ తమ కళానైపుణ్యతను కథాకౌశలమును, వాక్యచాతుర్యమును, చిత్రరచనాపటిమను సద్వినియోగముచేయక వృథా చేసుకొనుచున్నారు గదాయని ఈసభవారు విచారించుచున్నారు.

'ఇకముందు ప్రచురింపబడే గ్రంథపత్రికాదులలో ఈవిధమగు వ్రాతలనూ చిత్తరువులనూ నిషేధించవలెననియు వ్రాయువారిని మందలించవలెననియు ఈ సభవారు పత్రికాధిపతులనూ ముద్రాలయాధికారులనూ ప్రార్థించుచున్నారు.'

అందరు విని ఆమోదించారు' అంది సీత.

'మీ స్త్రీలమీద ఎవ్వరు వ్రాస్తున్నారని స్త్రీలందరు ఇంతకట్టుగట్టి ఇంత అలజడిచేస్తున్నారు. మాకు మట్టుకు అల్లావుండదూ? మీరు వ్రాశారని.'

'ఆభయం మీకెప్పుడువద్దు. ఇదివరకు వ్రాయలేదు. ఇప్పుడు వ్రాయటంలేదు. ఇకముందు వ్రాయము అని మా స్త్రీలందరితరఫునా నేనే చెప్పగలను. మాకు పురుషవర్ణనతో పనిలేదూ అని వ్రాసిఇవ్వమన్నా ఇచ్చుటకు సిద్ధముగావున్నాను' అన్నది సీతధైర్యంగా.

'సీతా! నేను ఎప్పుడన్నా స్త్రీలవర్ణనతో కథలు వ్రాశానేమో చెప్పు?'

'వ్రాయకేమి? అంతా ఇల్లాగే అంటారు. ఎక్కువగా వ్రాయకపోయినా సమయంవచ్చినచోట పువ్వొత్తుల్లో సూరేకారంలాగ వాక్యాలు వేస్తూనేవుంటారు. చక్కని స్త్రీ అంటె అందరికీ అర్థంకాదూ? ఆమె నిలువంతా వర్ణించడమెందుకు? ఇక ఆపత్రికలమాట తలపెట్టకండి నాకు వళ్లుమండుతుంది. ఇవిగో తమల పాకుల చిలకలు.'

'.........'

'పుచ్చుకోండి. అదుగో రాధ కదులుతున్నాడు లేచి ఏడుస్తాడు.'

'పత్రికలంటేనే కారంచల్లినట్లు మండుతున్నదే నీకు? నాకెందుకు మీగోడవ తమలపాకులు ఇల్లా ఇయ్యి.' అని పక్కన నవ్వాడు వికటంగా రామారావు.

'అల్లాగే వుంటుంది. మీరుచేసేపని మీకు నవ్వుగాకపోతే చేస్తారా? 'పిల్లికి చెర్లాటం ఎలుకకు ప్రాణసంకటం' అన్నట్లు మీకు నవ్వు మాకు దుఃఖం' అని తమలపాకులు ఇచ్చి చివ్వునలేచి వెళ్లిందిసీత. తెల్లవారితే మామూలే. అలు మొగళ్ల తగువు అద్దమ్మీద పెసరగింజ దొర్లినంతసేపేగా.

# శిరోజములు

శ్రీమతి ఆర్కాటు సత్యవతీబాయిగారు

శిరోజము లనఁగా తలయందు పుట్టినటువంటివి; తలయందు పుట్టునట్టివి పేలు, తలనొప్పి, ఆలోచనలు మొదలయిన వెన్నోయున్నను, ఆపదము తలవెండ్రుకలకు మాత్రము రూఢిగా చెల్లుచున్నది.

పూర్వకాలమున నీ శిరోజములకు మిక్కిలి యాధిక్యము నిచ్చుచుండిరి. సౌమంగల్యమును దెల్పుటకు శిరోజములే గుర్తుగనుండెను. ఎన్ని వెండ్రుకలుండిన నంత యందమని పూర్వులు తలంచుచుండిరి. పురుషులుకూడ పొడవైన కురుల నుంచుకొనుచుండిరి. స్త్రీలకు పురుషులకంటెను కురులయం దెక్కువ మక్కువయుండెడిది. పూర్వులు కురులు దట్టముగ పెరుగుటకై చక్కనిపోషణ గావించుకొనుచు, ప్రతిదినమును తలంటుకొనుచుఁ జాల చిక్కులను పడుచుండిరి. పురుషులకంటెను స్త్రీలకు నిడుపైన దట్టమైన శిరోజములుండిన నందమని వాని యభివృద్ధికై మిక్కిలి కష్టపడుచుండిరి. కురులుండి, చక్కగనుండిన స్త్రీ పురుషులను పూర్వకవులు మిక్కుటముగ నల్లని వెండ్రుకలయినయెడల తుమ్మెదలకు పోల్చి వర్ణించుచుండిరి. పూర్వము ద్రౌపది, సీత మున్నగువారికి నిడుపైన వెండ్రుకలుండెననియు, నవి నల్లనై మృదువుగనుండెననియు మనము పురాణములందు జదువుచున్నాము. దుశ్శాసనుఁడు ద్రౌపది తల వెండ్రుకలను బట్టికొని దుర్యోధనుని సభకీడ్చి తెచ్చెను. ఆమె కురు లంత పొడవుగ నుండుటబట్టియే కదా యత డట్లు కావించెను? ఆమె వెండ్రుకలను పట్టినంతనే యామె యాతని శపించుచు తన పవిత్రమైన వెండ్రుకలను ముట్టుకొనెనని మిక్కిలి దుఃఖించెను గాని తనకైన యవమానమును కూడ నామె యోచించలేదు. సీత తానశోకవనమందున్నప్పుడు తన యవయవము లెంత కృశించినను చింతనొందలేదు, కాని తన "నిడుద పెన్నెర వేణి జడనుగా ధరియించి యుంటి"నని రామునికి చెప్పుమని హనుమంతునితో సందేశమంపెను. ఈ యుదాహరణములనుబట్టిచూడ పురాతనులు కురుల కెక్కువ యాధిక్యమిచ్చుచుండిరని తెలిసికొనగలము.

నేటి కురుల పరిస్థితి నాలోచింతము. ఆంగ్లేయుల పరిపాలనమునందున్న మన దేశస్థులు వారి యాచారములను, పద్ధతులను ననుసరించుచున్నారు. ఆంగ్లేయులు శిరోజములను కత్తరించుకొని యది సొగసుగ నుండునని తలఁచుచు వీధులందు తిరుగుచుండగా చూచి, మన నేఁటి నవనాగరికులు వారి ననుసరించి తాము కురులు కత్తిరించుకొనిన సొగసుగనుందురని తలఁచి కత్తిరించుకొనుచున్నారు. వీరు పురుషులే గాదు, స్త్రీలుగూడను! పూర్వము భర్త



అమరావతి శిల్పచిత్రములందొక రూపము



బళ్ళారిమండల విద్యావిషయిక ప్రదర్శనముల సందర్భమున **Indian Maypole Dance** నృత్యగాన సహితముగ నభినయించి ప్రజలను రంజించిన బళ్ళారిరాజకీయోన్నత బాలికాపాఠశాలా విద్యార్థినులు.

చనిపోయిననే కురులు కత్తిరించుచుండిరి. కాని నేఁడు భర్తలున్నను, 'ఫేషను' (Fashions)లకు లోనై, కురులు కత్తిరించుకొని తిరుగు చిగురుబోడుల (Bobbed heads)ను పెక్కుమందిని చూచుచున్నాము గదా! వారి మోము లెంత కళావిహీనములుగనుండునో మనకు తెలియునుగదా? పూర్వము దట్టముగ శిరోజములను పెంచుకొని శిరమునం దనేకాభరణముల నుంచుకొని మిక్కిలి షోగ ద్దగాంచిరి. నేఁడు మన దేశము దౌర్భాగ్యస్థితియం దున్నందున తలకు రాచుకొనుటకు నూనెయు, తలంటుకొనుటకు శీకాయము ఖర్చగునని కురులను కత్తిరించుకొని వికారస్వరూపులగుచున్నారు. విధవలుమాత్రము కురులను పెంచుకొనకూడదని పూర్వీకుల యాచారములం దుండెను. కాని నేఁడు సధవలును వెంట్రుకలను తీసివేసికొనియున్న నందమును పోగొట్టుకొనుట మిక్కిలి హేయము.

శిరోజము లుండినయెడల నెంతటి వికారస్వరూపులును, కురూపులును కొంచెమైన నందముగ కానఁబడుదురు. నిడుపైన శిరోజములుండిన నిష్టానుసారముగ సర్వాభరణములతో నలంకరించికొని వివిధములైన యలంకరణములను జేసికొనవీలగును. రోజ, మల్లె, సంపెగ మొదలగు పలురకములైన సుగంధపుష్పముల నలంకరించికొని వాని వాసనలను చూచుకొని యానందింప వీలగును. కాని శిరోజములను తీసివేసికొని కాళాహీనములైన మోములతో నుండిన యెడల మన భారతమాతకు లోటుచేసిన వారమగుదుము.

కాన ప్రతిస్త్రీయు చక్కని వెండ్రుకలను పెంచికొని శిరోజముల సౌందర్యము ననుభవింపవలెను. నిడుపైన కురులుగలవారు వానిని పెక్కు జడపిన్నులుగ్రుచ్చి చిక్కుచేసికొని పాడుచేసికొనక తగినరీతి నలంకరించుకొనుట మంచిది.

---

## ఎంత గష్టింప ఫలమేమి యేమిమిగులు!

గీ. మింట మద్యాహ్న సూర్యుండు మంటలెగయ; శ్రమముచే ముద్దునగు మోము కమలిపోవ
స్వేదబిందులునుదుటిపై చిందులాడ, పేడపల్లిక పూర్ణించె పేదరాలు.

గీ. ఇల్లుఁజేరంగ హృదయంబుఁ దల్లడిల్లు, యిభగమనగతిఁ గనలేక యినుఁడుఁగ్రుంగఁ
జలదమాలోన వినువీథి నలమికొనుచుఁ, గర్షకామోదముగఁగుర్సె వర్షధార.

గీ. అలజడియు పీడఁదడివానఁ జలకమాడి, వసతికరుగంగనిలచెనా వట్టితట్ట
దూరమగునేని విధిబలం బేరికైన, నెంతగష్టింపఫలమేమి! యేమిమిగులు!

మందరపు పద్మనాభాచారి.

# సేవాసదనాలు — ప్రభుత్వకర్తవ్యము

'పద్మ'

'మానవసేవయే మాధవసేవ' అంటూ ఉంటే ఆధ్యాత్మికచింతతో మునిగిపోతున్నటువంటి హిందువులకు పరమసంతోషము. ఈసంతోషము ఆవాక్యము నుచ్చరించడములోనే ఉన్నదిగాని కార్యాచరణలో నాస్తి. నిజంగా అంతఃకరణ పరిశుద్ధతతో 'పరోపకారార్థ మిదంశరీరం' అని అయాచితముగా 'మాఫలేషు కదాచన' అంటూ సంఘసేవచేసే ఉద్దేశమైనాగలవారు ఈభారతదేశములో ముప్పదియైదుకోటి జనులలో ఎందఱుంటారు? దరిద్రులతో మగ్గిపోతున్న యీదేశములో సంఘానికి కాదు గదా తనకుదానే సేవచేసుకోవడానికైనా పూర్తి అవకాశములున్నవా? సరే ఉన్న ఆకొద్దిమంది సంగతి అవాచ్యము—ఎందుకంటే వారు కులాసాగా మోటారుకార్లలో తిరుగుతూ రేసులు, క్లబ్బులు ఇత్యాది (అ) సద్గోష్ఠిలో వాళ్ల తాహతు, మర్యాద నిలుపుకోవడానికి అప్పొనప్పొయైనాచేసి కాలక్షేపంచేస్తూంటే అదే వారికి మాధవసేవ.

ఏదెట్లున్నా ఇదొకసేవ. దీనినే పెక్కువిధాల శ్లాఘిస్తుండేవారు. మన శాస్త్రకారులు, మన పూర్వులు. నేడిట్టె 'సేవ' తుచ్ఛముగా నీచముగా కనబడుతున్నదంటే అది (కలి)కాలమహత్త్వమని ఒప్పుకోవలసిఉంటుంది. అంతే. కానీ మొత్తము మీంద సంఘసేవకు అవకాశముదొరికితే యెవడైనా గర్వింపతగ్గవిషయమే. అవకాశములూ, అభివృద్ధి తగినంతవున్నా ఇప్పటికిని దీని నొక 'వ్యాపారంగా' **(Profession)** విదేశీయులు పరిగణించరు.

సంఘసేవచేయడానికి శిక్షణ, పొందినచో ఆసేవ ప్రయోజనవంతమగును. లక్ష్యము, శిక్షణ—యివి లేకుండ నియమరహితమైనసేవ బూడిదబోసిన హవిస్సే కాకుండా కొన్నిచోట్ల అపాయము, అపకారముకూడా చేస్తుంది. ఈవిషయములో విదేశీయులలో ఎట్లు జరుపుతున్నారో గమనించుట మంచిది.

సంఘసేవ శిక్షాపాఠశాలలు ఏర్పడుటకు కారణము సోదరమానవులకు సేవ చేయడానికి ప్రజాసముదాయములో కల్గిన ఉత్సాహము. ఈ ఈఉత్సాహము అధికమగుకొద్ది—అంటే సంఘసేవ అభిలాషులసంఖ్య యెక్కువగుకొద్ది - వీరిపట్టుదలలో ఒక క్రమత యేర్పడినకొద్ది పాఠశాలలు నిర్మింపబడుతూ ఒక నియమ ప్రకారము అందతికిని శిక్షణ యిస్తుండేవారు. అసలు ఈపాఠశాలల నిర్మాణమునకు విద్యాసంస్థలు పూనుకోలేదు. వీటిలో చదివే వారిసంఖ్య హెచ్చవడము, వీటి ప్రయోజనము దినదినము వృద్ధవుతూ విశదం కాజొచ్చినకొద్ది విద్యాసంస్థలు వీటితో సంబంధాలు కల్గించుకొని తత్ సంస్థాభివృద్ధికి సంపూర్ణసహాయము చేస్తూవచ్చినవి. ఆదిలో సేవాభిలాషులకు పాఠ

శాలలు నిర్మించడానికి అక్కడక్కడ వెలసిన సాంఘిక సంస్థలే ముఖ్యకారణాలు.

అమెరికాలో ఇప్పటికి ఏబదియేండ్ల క్రితమే యేర్పడిన యీపాఠశాలలలో ముఖ్యముగా నీక్రింది మూడు విషయములు బోధింపబడుచున్నవి. 1. సాంఘిక సేవకు మూలాధారసూత్రములు, 2. సాంఘికసేవకు అనుగుణమైన శాస్త్రసిద్ధాంతములను యథేచ్ఛముగా స్వీకరించడము, 3. సాంఘికసేవాపరమార్థము— తద్విధానము. ఇట్టి విద్యాభ్యాసము ఒకటి రెండేండ్లదాక జరిగి యీకాలములోనే బాహిరజగత్తులో కావలసిన తర్ఫీదు పొందుచుండవలె. శిక్షణ పూర్తి అవడముతో ఆయాపాఠశాలలు ఒక ధృవపత్రమిచ్చేవారు. కానీ ఈస్కూళ్లలో శిక్ష పొందడానికి వచ్చేవిద్యార్థులకు ఎట్టిఅర్హత లుండవలెనో తెల్పడము చాలా కష్టముగానున్నది. మొదట ఎన్నిబాధలు పడినా యీస్కూళ్లలో ఇప్పుడు, డిగ్రీలపొందిన వాళ్లకే ప్రవేశము.

ఈపాఠశాలల్లో ఇట్టిసంఘాలలో స్త్రీలసంఖ్యయే చాలా యెక్కువగా ఉండడము ఒక్క అమెరికాలోనేకాదు. యూరోపుఖండంలో ఇంతకంటె విపరీతముగా ఉన్నదిసంగతి. జర్మనీలోనైతే సేవాసంఘాలు కేవలము స్త్రీసంస్థలుగానే ఉన్నవి. బెల్జియము జర్మనీదేశాలలో సేవాశిక్షణలొసగు పాఠశాలలు ప్రభుత్వాధీనములుగా ఉండడము ప్రశంసనీయవిషయము. మీదుమిక్కిలి యీపాఠశాల ధృవపత్రము పొందినవాళ్లు ప్రభుత్వములోని పదవులకు ప్రవేశించవచ్చును.

"Social work, like teaching, is predominently a women's professiOn' (Mary Clarke Burnett) (సంఘసేవ ప్రధానముగా స్త్రీసంబంధి వ్యాపారము) అనేసూత్రము సర్వజనాంగీకారము బడయగలదు. స్త్రీసంస్థ లెక్కువయ్యేకొద్ది యిట్టి పాఠశాలలు, తద్వారా శిక్షణపొందిన సేవాభిలాష యువతులు యెక్కువయ్యెదరు. స్త్రీసంస్థలకు బల మిచ్చేకొద్ది సంఘసేవ అధికమవుతుంది. జర్మను యుద్ధసమయములో ఆయాదేశ స్త్రీలు స్వదేశమునకు సహాయపడుటకు పూనుకొన్నారు. తనకిష్టములేకున్నా స్త్రీ సహకారసామర్థ్యాతులకోసము ఆస్క్విత్ ప్రభువు వోటింగుహక్కు ప్రసాదించుచట్టము నొకదానిని గావించినాడు. అమెరికాలో ప్రెసిడెంటు విల్సన్ యుద్ధవిజయకాంక్షకు పార్లమెంటులో స్త్రీల ప్రాతినిధ్యము అవసరమనిగుర్తించి వారికి వోటింగుహక్కిచ్చినాడు. రష్యాదేశములో స్త్రీ పురుషభేదము అసలు తీసివేసినారు. ఇట్లు ప్రతి దేశములోను స్త్రీస్థానము సంఘములో హెచ్చవుతూవచ్చి నేటికి మంచి ఉచ్చదశలో ఉన్నదంటే మనదేశములో అత్యధమాధమస్థితిలో ఉన్నదానికి చాలా సిగ్గుపడవలసియున్నది. శార్నార్డు స్టర్న్ గారు ఎన్సైక్లోపీడియాలో "Except for few educational projects the British Government has done nothing to improve the status of Indian women. particularly the lower castes Demands for women's rights have been part of Indian National Movement, in which women have been prominent......" అని భారతదేశస్త్రీలగూర్చి స్పష్టముగా వచించియున్నారు. ఆంగ్లప్రభుత్వమువల్ల మనకు కలిగిన నష్టకష్టములు మనకు వింతపుట్టించేవి కావు. శ్రీ గాంధిమహాత్ముని పుణ్యమా అంటూ అక్కడక్కడ స్త్రీసంఘములు పుట్టి జాతీయవికాసమునకు తోడ్పడుచున్నవి. మానవసేవ నిజముగా మాధవసేవయని చేసిచూపెట్టి అట్టి కళ నిరూపించినది గాంధిమహాత్ముడనడములో సందేహము లేదు. జాతీయోద్యమము బయలుదేరి విజృంభించినతర్వాత సంఘములో స్త్రీకిఅగ్రస్థానము లభించినకొద్ది స్త్రీలోకమున కీవఱకుజరిగిన లోపములను సవరుటకు పెద్దలు పూనుకొన్నారు. వారును అక్కడక్కడ విశ్వవిద్యాలయములు, సేవాసదనములు—వీటినిస్థాపించి సోద్ధరణకై పాటుపడు

తున్నారు. ముఖ్యముగా ఇంతవఱకేర్పడిన సేవాసదనాదిసంస్థలలో విద్యకే ప్రాముఖ్య మొసగబడుతున్నది. వీరికి సంఘసేవలో ఆసక్తికల్గుటకు దేశసేవ కలగ తర్ఫీదుచేయుటకు తగిన పాఠశాల లింతవఱకు మనదేశములో ఎక్కడగాని స్థాపింపబడలేదేమో? సత్యాగ్రహోద్యమములో పెక్కుస్త్రీలు కారాగృహమునకు వెళ్లినారంటే దానిలో పెద్దశిక్షణ, తర్ఫీదుపొంది యెవరును వెళ్లలేదు. అదిన్ని జైలునుంచి తిరుగా వచ్చినతర్వాత మరల సంఘసేవ (అంటే దేశసేవ)కు పూనుకొన్నవారు చాలాతక్కువ.

గ్రామోద్ధరణఅని మూలమూలలలో వాపోతున్న మన మంత్రివర్గము సంఘసేవకుల సహాయములేక తమ ఆశయముల నెరవేర్పడము పరమదుష్కరము. బాగుగా తర్ఫీదుపొందిన వాలంటీర్లు (ముఖ్యముగా స్త్రీలు) ఉంటేనే ప్రభుత్వమువారు ప్రజలకు చేస్తున్న మంచిచెడ్డలు గ్రామాలకు వ్యాపించడానికి వీలవుతుంది. జర్మనీమాదిరి మనదేశములోకూడా ఇట్టి దండును తయారుచేస్తేనే ముమ్ముందు దేశానికి లాభముంటుంది. స్పెయిన్‌లో చైనాలో స్త్రీలు తుపాకులచేబూని యుద్ధము చేస్తున్నారంటే వాళ్లకుగలిగిన శిక్షణయే వాటికన్నిటికి ప్రథమకారణము. ఈదండు తయారుచేయడానికి ప్రభుత్వమువారు పాఠశాలల నిర్మించి అందులో ఉత్తీర్ణులై ధృవపత్రమునందిన వారినే Propagandists గా నియమించితే యెంత బాగుంటుంది? వీళ్లకు జీతమెంత యివ్వవలెనని ప్రశ్న బయలుదేరుతుందేమో? అధమము ఒక ఎలిమెంటరీ స్కూలు టీచరుకిచ్చే జీతమిస్తే ప్రస్తుతము చాలుననుకోవచ్చు. జీతమెంతైనను దానితో లెక్కలేదు. చేస్తున్న పనియొక్క ఉత్తమత్వమే ప్రధానము. వార్ధా విద్యస్కీముకూడా ఇట్టివాళ్లనే తయారుచేస్తుందేమోనని ఉపేక్షించక ప్రభుత్వమిప్పటికైనా అట్టి శిక్షణశాల నేర్పాటుచేస్తారా? ఇందులో మద్రాసు ప్రభుత్వము ముందంజవేస్తే ఒకేసారి ప్రపంచమంతా ముక్కున వ్రేలుపెట్టుకొని అన్నిటికీ మద్రాసే ముందడుగంటూ ప్రశంసిస్తారు. లేకపోతే—

## గృహలక్ష్మీ!

తళుకుతళుకునబంగరు వెలుగులీను
మేనికాంతుల నాంధ్రప్రజానికాయ
హృదయకుహరాంధకారసంపదలనడుమ
నారిపోవని దివ్య విజ్ఞానరత్న
దీధితుల నెల్లయెడ బ్రతిష్ఠించినావు;
నవ్యభావోదయంబు గ్రొందళుకునుడుల
నక్షరాక్షరమందు దీవ్యత్ప్రకాశ
మొసగు నీనేర్పుపద్దెపు ముత్తియముల
తెలుగుకొమరుల గళముల నలరజేసి
తెలుగుబాసకు వన్నెగడించినావు;
కలముపోటున రతనాల గనులపేర్చి
కూర్చి సృజియించు కవిధాతృకులముకెల్ల
నిన్ను జేపట్టుకోరిక నిలిపినావు;
చెప్పినకొలంది పాకవి స్మృతివహించి
తీయతీయని కథలొక రేయివేయి
జెప్పి మనములనూత్న విచిత్రచిత్ర
రసములొలికించి బాహ్యనిద్రాప్రమోద
మొసగుసత్కథాపటిమచే నోడిసినావు;
ఆంధ్రదేశంపుదీవన లందినావు
ఆంధ్రజనముల మన్నననలరినావు;
పత్రికారాజములశిరః పట్టమందు
దివ్యమూర్ధాభిషిక్తవై తేజరిల్లి
సాటిలేని రాజ్యమునేల సాగినావు;
గృహగృహమ్ముల లక్ష్మివై కెరలినావు;
ఆంధ్రగృహలక్ష్మి! పత్రికోద్యానలక్ష్మి!
నుతుల జేకొమ్ము నానమస్కృతులగొనుము.

అంబటిపూడి నరసింహశర్మ.

# *** సింహాచలము ***

శ్రీ ఆచంట లక్ష్మీనరసింహముగారు

విశాఖపట్నం మండలమునగల సుప్రసిద్ధమును, సుందరమనోజ్ఞ ప్రకృతిశోభితమును, నగు నీమహాక్షేత్రము గాంచుభాగ్యము నాకు యిటీవలనే కలిగినది. పుణ్యక్షేత్రమగుటచేతను రామణీయక ప్రకృతిశోభ కలిగియుండుటచేతను, ఆంధ్రులకీర్తి, ప్రతాపములను దిగ్వలయమంతటను తాండవింపజేసిన కృష్ణరాయ సార్వభౌముని శాసన మిట నుండుటచేతను, యీ క్షేత్రము ఆంధ్రులెల్లరకు నవశ్యదర్శనీయము. ప్రయాణము మిగుల సులభము. వాల్తేరునుండియు, విశాఖపట్నమునుండియు నిచటికి యెల్లప్పుడును జట్కాలు, బస్సులు రాకపోకలు చేయుచుండును. దూరము విశాఖపట్నమునకు 10 మైళ్లుమాత్రమే. మాధవధార మీదుగా నడచివెళ్లువారికి, యీదూరము యింకను తగ్గును. సింహాచలము స్టేషనుకూడ నున్నది. స్టేషనుకును కొండకును 3 మైళ్లుండును.

కొండదిగువనుగల యూరు చిన్నది. ఇచట సమృద్ధిగా అనాస, బొప్పాయి వగైరాఫలములును, పూలును దొరకును. కాఫీహోటళ్లు, భోజనశాలలు కూడ నున్నవి. మరియు నీక్షేత్రమునకు ధర్మకర్తలగు విజయనగరాధీశుల భవనములు, వారిచే నెలకొల్పబడిన హాస్పిటలు, యాత్రికులకొరకు ధర్మశాలలు నున్నవి. కొండపైకి బిడ్డలను ఎత్తుకొనివచ్చుటకు, బరువులుమోయుటకు, వింతలనుచూపుటకు చవుకకూలికి మనుష్యులు దొరకుదురు.

కొండ ఎక్కుటకుగల మెట్లమొదటనే భైరవద్వారమున్నది. (విష్ణుక్షేత్రమయ్యును, తొలుతనే భైరవద్వార ముండుటనుబట్టియు, కొండపైగల పెక్కు జలధారలక్రిందను, కొండపైనను శివలింగములు పెక్కుండుటనుబట్టియు, యీ క్షేత్రపతియగు వరాహనరసింహమూర్తి నిజరూపు సంవత్సరమందొక్క గంధపు ఒలుపుదినమగు వైశాఖశుద్ధ ఏకాదశినాడు తప్ప, మిగతదినము లన్నిటియందును, చందనచర్చలచే గప్పబడి, లింగమూర్తి యాకారముగ నుండుటను బట్టియు, పూర్వమీ క్షేత్రము శైవక్షేత్రమనియు, రామానుజాచార్యులకాలమున వైష్ణవక్షేత్రమయ్యెనని యు దెలుపు జనప్రవాదమున కాధారమున్నట్లు తోచును). మెట్లువెడల్పుగాను, ఎడముగానుండి, శ్రమలోచనీయక ఎక్కుటకు సులభముగానున్నవి. మరియు నివి శుభ్రముగానుండుటకూడ సంతోషమైనది. పూర్వమున్న మెట్లు గాలివానవల్లపోగా, సంస్థానమువారు రు. 40,000 లు వెచ్చించి, ప్రస్తుతపుమెట్లు తీర్చిదిద్దినారని తెలిసినది. కొండ కిరుప్రక్కలజూడ నాయానంద మేమనిచెప్పను? అన్నియు నుపయుక్తములగు ఫలవృక్షములే! యెటుచూచినను, కనులకింపగు మామిళ్లు, పనసలు, అరటులు, రామాఫలవృక్షములు, బొప్పాసచెట్లును, అనాస తోటలును కానవచ్చుచుండెను. కొండపైనుండి నిరంతరముగ ప్రవహించు ధారలనీరును, యినుపగొట్టముల గుండాను, సన్నని కాలువలద్వారాను యీవృక్షముల మొదళ్లకు ప్రవహింపజేయుచున్నారు. ఇచటి అనాస తోటలు ప్రసిద్ధమైనవి. అనాసపండ్లు రాష్ట్రమంతటికిని, యిచటినుండియే సరఫరాయగునని, ఋతువునం దిచట కారుచౌకయని తెలిసినది. ఇప్పుడుకూడ కొండమీదను, దిగువనుకూడ అనాసపండ్లు, బొప్పాసపండ్లు విరివిగానే విక్రయించుచున్నారు. సుజలయు, సస్యవృక్షశ్యామలయు, సుఫలభరితయునగు నీపర్వతమునుజూడ, ప్రాచీన ఋష్యాశ్రమములును, "ఫలరసాదుల గురియవే పాదపములు, స్వాదుజలముల నుండవే సకలనదులు, ధనమదాంధుల కొలువేల తాప

కులకు'' అనెడి పోతనహితవు స్మృతికివచ్చినది. ఇచట నటనట చిన్నగుహలుకూడ నున్నవి.

మరికొంతదూరము పైకిపోగా, ఆకాశధారయు, అచట క్షేత్రపాలకుడగు ఆంజనేయస్వామి దేవాలయమును ఆంజనేయద్వారమును కలవు. దారియందు 2,3 చోట్ల చక్కని విశ్రాంతిమండపములున్నవి. కొండ హెచ్చు ఎత్తులేకపోవుటచే అశ్రమముగానే పైకి ఎక్కవచ్చును. కొండపై వర్షము, ఒరవనువదిలేక సంవత్సరముపొడుగునను, నిరంతరమును ధారగా పడుచుండు ఆకాశధార, పుట్టుధార, గంగధార మొదలగు 12 జలధారలున్నవి. వందలకొలది యాత్రికులీధారల క్రింద నిరంతరమును స్నానమాడుచుండురు. ఇందొక ధార స్వామివారి వంటగృహములో నున్నది. చిత్రమేమన్న, యిన్నిధారలనుండి నీరు నిరంతరము పడుచున్నను, ఆనీరంతయు, కొండమీదచెట్లకు పైరులకే పరిపడునుగాని, ఒక్కబొట్టయినను దిగువకురాదట!

దేవాలయములో ప్రవేశించగానే, మహాక్షేత్రమని వ్యక్తముచేయు వేదఘోష చెవులపండువుగా వినిపించినది. అట, స్వామి యర్చామూర్తి, దివ్యమోహనవిభూతితో కొలువైయుండెను. అటనుండి ముందుకు సాగిచూడ, ఆలయముచుట్టును, ముఖమండపమునను, ప్రాకారమండపముననుగల శిల్పవైభవ మేమనిచెప్పగలను? విశాలములై, యున్నతములైన, ఏకశిలా స్తంభములు, పలుతెరగుల చెక్కడములతో, తీగెలు, రాగులతో, వివిధావతారగాథలతో, పలువిధములైన నాట్యభంగిమములతో శోభిలుచున్నవి. దేవాలయముపై నొకపాదమున భూమియు, నొకపాదమున నాకసమును నాక్రమించిన త్రివిక్రమునిలీలయు, నిర్వైరపాటుగదిరిన సభ్యులదృశ్యమును అత్యద్భుతముగా చిత్రించబడినది. చేతనారహితములైన కఠినశిలలను, చిత్తమునకువచ్చిన తెరగున మనోజ్ఞలీలలమలచి, అమరశిల్పమును ప్రదర్శించి, అజరామరమైన కీర్తిసంపాదించిన యాంధ్ర శిల్పులకు జేజేలొనర్చితిని. ఆశిల్పవైభవముచూచి యానందించదగినదేగాని, వర్ణించ నలవిగాదు. కొంతకుకొంతరైన, ప్రతిబింబములు సంపాదించుటకు చేత కెమెరా లేకపోయెనే యని యనుస్మరించితిని. శిల్పములు చెడకుండుటకును, దర్శనీయములుగా నుండుటకును, దేవాలయాధికారులు వాటన్నిటికిని నూనెపూసిరి. దేవాలయము పెద్దదైనను వర్ణశిఖరము చూడ ముచ్చటైనది. (రు 35000 ల బంగారును కరిగించి యీశిఖరమునకు పూతపూసినారట!)

మండపమునందు తెలుగు, ఒరియా, అరవశాసనములు పెక్కులున్నవి. వానినడుమగల చరిత్రాత్మకమగు నాంధ్రభోజునిశాసనమును స్వయముగా చదివి యానందించితిని. మూడురాయరగండడును, గాఢపరమేశ్వరుడును నగు రాయలు కొండవీడు, ఉదయగిరి, రాజమహేంద్రవర దుర్గములనుసాధించి, ఉత్కళుల స్వాధీనముగనున్న యీప్రాంతమునుజయించి, శాలివాహనశకం 1478లకు సరియగు నిజధాతు సం॥ బహుళ ద్వాదశినాడు సింహాచలమునకు విజయంచేసి, స్వామివారినిదర్శించి, చిన్నమ్మాదేవిచే శ్రీవారికి వెలగల పెక్కుముత్యములు, రత్నకిరీటము, పెద్దపచ్చ 2000 మాడలు ధర్మము చేసినట్లున్నది. నాభాగ్యము వలన నాడు స్వామివారు రాయలచే బహూకరించబడిన రత్నకిరీటము, పెద్దపచ్చవేయబడిన హారము దాల్చియుండుటకుచూచి మురిసితిని. మరియు నిచట, ఆనందగజపతి మున్నగు విజయనగరాధీశుల శాసనములుకూడ చాలయున్నవి.

పిమ్మట గంజాము, విశాఖపట్న మండలములందును, ఆప్రాంతీయులున్నచోట్లనెల్లను వినవచ్చు అప్పన్న, అప్పడు, అప్పలమ్మ, అప్పారావు, అప్పలస్వామి పేరులకు మూలమూర్తియగు, శ్రీవరాహ నరసింహుని విరాణ్మూర్తిని దర్శించితిని. నిలువెల్ల తెల్లని చందనము పూతతో గప్పబడి, స్వామి నిజరూపము గానరాక, వెల్లని ఏకలింగమూర్తి కానవచ్చును.

గర్భగృహమును, అచటి పరికరములన్నియు రజతమయములుగా నుండెను. నారాయణుడింకను వరాహరూపముననుండగానే, తండ్రిచే ప్రహ్లాదుడు సముద్రమున త్రోయబడుచుండ, వాత్సల్యమూర్తియగు నా ప్రభువు బిరబిర సగమువరాహాకృతితోను, సగమునరసింహాకృతితోను తోచి, బాలభక్తశిఖామణిని బ్రోచి, యీశైలమున నెలకొనెనని, స్థలపురాణము వాకొనుచున్నది.

సంవత్సరము పొడుగునను పూయబడు చందనచర్చలు, సంవత్సరమునకొకసారి వైశాఖ శుద్ధ ఏకాదశినాడు ఒలువబడి నిజరూపమున స్వామి భక్తులకు కాన్పించుచున్నాడు తొలుత దర్శన పూజాభాగ్యములు శ్రీ విజయనగర మహారాణిగారివనియు, పిమ్మట భక్తులందరకు లభించుననియు, నాటి వైభవము, ప్రజలకోలాహలము స్వామికి జరుగు పూజావిశేషములు యింతింత కాదని తెలిసినది. నాడు దేవాలయాధికారులందరును పైవస్త్రములుమాని కైంకర్యములోనుండురనియు, స్వామిమహిమ గోచరమగునట్లు ఒక్కొక్కరివీపుపైనను విద్యుత్ప్రవాహము ప్రవహించుచున్నట్లును, చురుకుచురుకుమను దెబ్బలు పడుచున్నట్లుండునని, యొక పెద్ద దేవాలయాధికారి తెలిపెను.

కొండమీద పెక్కు ధర్మశాలలు, వసతిగృహములు యాత్రికులకొరకు నిర్మించబడియున్నవి. వీనిముందును, ద్వారములముందును వాని పేరులను దెలుపు బోర్డులు ఆంగ్లమున నుంటచూడ, నాకు మిగులకంటకమయ్యెను. క్షేత్రమును నిత్యమును దర్శించవచ్చు ముఖ్యయాత్రికులు ఆంధ్రులు గనుక, యీఫలకములాంధ్రమున నుండుట లెస్స.

ప్రకృతిసౌందర్యమును మానవకృషియుజేరి, యీ శైలము భూలోకస్వర్గముగానుండి యిట్టిక్షేత్రమును యాత్రాస్థలముగానొనర్చిన పూర్వుల బుద్ధిసంపద పొగడదగియున్నది. కొండకు రెండవవైపున మాధవుని యాలయమును, ధారయు నున్నవట. నేను చూడలేదు.

ఇందలి ప్రకృతిశోభను, శిల్పరామణీయకమును గాంచి యానందించుటకును కలకాలమును తమ పూర్వుల యశోగానమొనర్చుటకును ఆంధ్రసోదర సోదరీమణులును, ముఖ్యముగా విహారయాత్రలకుగా విద్యార్థ, విద్యార్థినీగణములును, యిచటికి తండోపతండములుగా వెడలుదురుగాక!



# కొత్త జోడు

చ. రా.

మానాన్న భౌతికప్రపంచంలో మాకు దూరమై అప్పటికి నాలుగురోజులైంది. చిత్తడిజల్లులాగ గాలికి అశ్రువులు కురుస్తున్నాయి. వాతావరణమే తేమగావుంది.

ఇంటిముందు వరాండాలో పడకకుర్చీలో కూర్చొనివున్నాను. అఖిలప్రపంచాన్ని ఆవరించివున్న కాఱుచీకటి కంటికెదురుగా కనపడుతూవుంది. అంతకంటె గాఢంగా కమ్ముకుంది హృదయంలో చీకటి. దీని కైక్యం కలిగించడానికి కళ్లుమూసుకున్నా. అవ్యక్తమైన ఆలోచన లెన్నో బుఱ్ఱలో గిఱ్ఱున తిరుగుతున్నాయి. దగ్గరగా మంచం మీద మా పెద్దమ్మాయి రాజ్యలక్ష్మి కూర్చునివుంది కుమారునితో. ఆకృష్ణుడు గోడకు తగిల్చిన దీపాన్ని చూస్తూ, నవ్వులు వెదజల్లుతూవున్నాడు. చిన్నపిల్ల లేవో పుస్తకాలు ముందువేసుకుని చాపమీద చదవడంకంటె ఆర్భాటం ఎక్కువ చేస్తున్నారు. మాఅమ్మ ముసుగుతో తలవంచుకొని గోడవార కూర్చునివుంది. పనిపాటల్లో మునిగివున్నారు లోపల మిగిలినవారంతా. మేము నిశ్శబ్దంగావుండటం చూచి పిల్లలు కూడా క్రమక్రమంగా తమ చదువును కాగితాలు త్రిప్పడం క్రిందకు మాత్రమే మార్చారు. ఆలోచన లేమీలేకున్నా ఆలోచిస్తున్నవారిలాగ అదోరకంగా నెమ్మదిగావున్నాం.

'అమ్మా! చిన్నబాబుగా రున్నారా?' అనే ప్రశ్న చెవుల్లో దూరింది. కళ్ల తలుపులు తెరచుకున్నవి.

'అదో కుర్చీలో పడుకొని' అంది నెమ్మదిగా మాఅమ్మ.

'ఏమిరా వెంకన్నా?' అన్నాను.

మెడమీదవున్న దుప్పటిదీసి క్రిందపడవేస్తూ వరాండామెట్లమీద నిల్చున్నాడు మాదిగవెంకన్న.

'బాబూ! ఇలా దయచేయండి ఓమారు' అన్నాడు చేతులు కట్టుకొని.

'ఏమిటో చెప్పు. ఇక్కడే వున్నానుగా.' నాకు లేవడానికి బద్ధకం.

'ఒక్క అడుగు ఇక్కడికి దయచేయండి' అన్నాడు వెంకన్న చేతులు వెనక్కిపెట్టుకుంటూ.

మాటలనువిని లోపలనుండివచ్చి తలుపు కానుకొని నిల్చున్న మా రెండోఅమ్మాయి సుమతి అంది. 'నాకు తెలుసునులేరా. ఈ వేళ ఆదివారమన్నయ్యా. సంతదినం.'

అమ్మాయికి తెలుసునేమోకాని నాకు తెలిసినట్టెక్కడా సాక్ష్యంలేదు.

'వెళ్లన్నయ్యా! కానుకలిస్తాడు' అంది మరీ సుమతి.

'ఏమీలేదండీ బాబూ! ఇదో ఇక్కడికి ఓమారు' అన్నాడు వెంకన్న.

'సరే' నంటూలేచి మెట్లవద్దకు వెళ్లాను.

రెండు చేతుల్లోవున్న తెల్లనికాగితాల పొట్లాలు ముందుంచి నమస్కారంచేసి 'తీసుకోండి' అన్నాడు వెంకన్న.

'ఏమిటివి?' ఆశ్చర్యపడ్డాను.

'నేం చెప్పలేదా? ప్రతి ఆదివారమూ వెంకన్న యీవేళకు సరిగా పంచదారా పటికబెల్లముపొట్లాలు నాన్నగారికి తెచ్చి యిచ్చి నమస్కారంచేసేవాడు. నాన్నగారు వాని భక్తికి ఎంతో పొంగిపోయేవారు. ఆ తరువాత వారు అర్ధరాత్రివఱకు మాట్లాడేవారు. నాన్నగారికి బదులు యీవేళ మీ కయింది. ముందే అన్నానుగదూ?' అంది అంతా ముందే చెప్పినట్టుగా సుమతి.

'అతను అలాచేయడం మామూలే' అని మా అమ్మకూడా అంది. పొట్లాలు తీసుకున్నాను.

తరువాత వెంకన్న అన్నాడు. 'బాబూ గారూ! నాన్నగారి జోడు—నేను స్వయంగా కుట్టియిచ్చినది—ఎక్కడో ఇంట్లో వుంటది. అదిమాత్రం నాకిప్పించండి. నా గుడిసెలో వేలాడకట్టుకుంటాను పెద్దబాబు గారిని తలచుకుంటూ.'

'ఇదేమిట్రా జోడు కావాలంటున్నావు. ఇంతకంటే వేరే యేమీ నీకు తోచలేదా? పటమా, భాగ్యమా, ఇంకోకటా?' అన్నాను.

'అదే నా కిష్టమైనది. వేరే ఏమీ వద్దండి. నా కింక కావలసింది ఏమీలేదు. బాబుగారు పోయారు. నా బదుకు పాడయింది; ఇంకా అవుతుంది. నేంగూడా బతకను. బతకనివ్వరుకూడా' అంటూ కాళ్ల మీదపడి భోరున ఏడవడం మొదలు పెట్టాడు వెంకన్న.

నాకూ దుఃఖం వచ్చింది. నాలుగు దినాల క్రిందట ఏబాధా మెఱుగని మా నాన్న హటాత్తుగా 'ఇదిగో, ఇంక నేనులే' నంటూ అనంతవిశ్వంలో లీనమైనది మరల ఒకమారు మనోవీధిలో మెరిసిపోయింది. మరల గాలి వీచింది. అశ్రువులు వర్షించాయి.

దుఃఖమాపుకున్నాను. వెంకన్నను లేవనెత్తాను. శాంతపరచాను.

మా నాన్నగారికి మావూరి మాల మాదిగలంటే ఎంతో దయాసానుభూతి. వారి కుర్రాళ్లకు వూరివాళ్లందరిని ధిక్కరించి చదువు చెప్పారు. వారి వ్యవహారాలు తనచేతిమీదుగా నడిచేవి. వారికేవైనా రోగాలువస్తే రాత్రింబవళ్లూ మేలుకొని వారికి సేవచేసేవారు. వారి కేం కావలసివచ్చినా అచ్యుతరావుగారి సలహా గావాలి. వారు చేయగలిగి నన్నివిధాల వారికి సాయంచేసేవారు. వారందరిలో వెంకన్నకు మా నాన్నగారిపైన భక్తిప్రేమలెక్కువ.

ఇదంతా నాకు తెలుసును. అయినా ఎపుడోగాని నాలుగురోజులు ఇంట్లోవుండ నందున నా కా జోడు మాహాత్మ్యం తెలిసిందికాదు. వెంకన్న అలామాట్లాడడానికి కారణం అవగాహం అయిందికాదు.

'వెంకన్నా! ఏమిటి విశేషం. నాన్నగారి మృతి మాకే కాకుండా మీఅందరికికూడా నష్టకారణమయింది. దానికి నా హృదయ వేదన మిలిమీరుతూవుంది.'

'జోడు సంగతి జెప్పవలెనంటే ఓ పెద్ద కథవుతుంది బాబూ! అది అమ్మగారికి తెలుసు. ఇంట్లో అందరికి తెలుసు' అన్నాడు కన్నీళ్లు తుడుచుకుంటూ.

'ఔనురా నాయనా! నా కిపుడు జ్ఞాపకం వచ్చింది, జోడు సంగతి. మీ నాన్న వుండగా నీ కది తెలిసివుంటే నీవు నిజంగా సంతోషపడేవాడివి. ఇపుడు వింటే నీ కది మరింతవేదన కలిగిస్తుంది' అంది మాఅమ్మ నెమ్మదిగా.

'నేను ముందొకమారు వచ్చాను. అపుడు అబ్బాయి నెత్తుకొని నాన్న 'నీకుకూడా జోడు కావాలా, వెంకన్న కుట్టిస్తాడు' అంటూ ఆడించేవారు. అపుడు నే నడిగితే దాని సంగతంతా నాకు చెప్పి 'అన్నయ్యకిది తెలియనీయవద్దు. వాడు కోపపడతాడు'అన్నారు. నిన్ను డబ్బు అడగలేక నీకు కష్టం అవుతుందేమో అని ఇలాంటి బాధల పడ్డ తండ్రి'—తరువాత మాట్లాడలేక పోయింది రాజ్యలక్ష్మి.

సుమతి కథంతా చెప్పింది. మధ్యమధ్య మాఅమ్మా రాజ్యలక్ష్మి కొన్ని విషయాలు చేరుస్తూవచ్చారు.

* * *

వెంకన్నది పెద్దకుటుంబము. 'పిల్లాజెల్లా' కలసి పదిమందుంటారు. వ్యవసాయంలో తోడ్పడే తమ్ము లిద్దరున్నా గృహభార మంతా తనమీదనేవుంది. భూమిబుట్టలు కొద్దిగావుండేవి. అవయినా మెరకభూములు. అపుడపుడూ వానదేవుడు 'శీతకన్ను' వేస్తూవచ్చాడు. ఇంతలో ఆర్థికమాంద్యం బరువెక్కనైంది. అందుచేత సంసారానికయే బడ్జటు తీర్మానాలు తల్లక్రిందు లౌతూ వచ్చాయి. కాబట్టి అప్పులైనవి. రాగలగినంతాలాగి తుదకు భూములు లాగేశారు ఋణదాతలు. చాలినన్ని భూములు లేనందుచేత ఇంకా కొన్నిఅప్పు లాలాగే నిల్చిపోయినవి. అలాంటిదే పిండు భీమయ్యగారి అప్పుకూడా.

ఆనిరుడు వెంకన్నకు పొలాల్లో తినడానికి సరిపొయ్యే గింజలుకూడారాలేదు. మరీ పొలాలు విత్తవలసినకాలం వచ్చింది. దానికి పైకంతో అవసరంవచ్చింది. అప్పటికే కావలసినన్ని అప్పులున్నై. అయినా భీమయ్యవద్దకు వెళ్లాడు వెంకన్న. నూరు రూపాయలు అడిగాడు. ఆయేడే తప్పకుండా పంటకాలంలోవున్న ధరకే తాను పండింపబోయే వేరుసెనగ అసలుకు వడ్డికి తనకే యిస్తానన్నాడు. పదింటికి పావలావడ్డి కంగీకరించాడు. భీమయ్య డబ్బుయిచ్చాడు.

ఆమేడు వున్నభూమినంతా వేరుసెనగవేస్తే కొంత అప్పుతీర్చుకొని నాలుగుడబ్బులు చేతిలో వుంచుకోవచ్చునను కున్నాడు వెంకన్న. అయితే ఆయేడు వానదేవుడు యిష్టంవచ్చినచోటనే వర్షానికి ఆర్డరిచ్చాడు. వెంకన్నపైరు పాడయిపోయింది. ఆతని కేమీ దిక్కుతోచిందికాదు. ఆతరువాత అప్పులవాళ్లందరు భూములు లాక్కోవటం; సంసారం చీలిపోవటం; తనపాలికివచ్చిన భీమయ్య అప్పు పెరిగిపోవడం; కూలినాలి చేత జీవనం జరపడం వెంకన్నసంసారంలో జరిగినమార్పులు.

'అప్పులు వసూలుచేయడంలో ఇంటి పేరు సార్థకంచేసే పిండు భీమయ్య అప్పు తీర్చడమెలాగ?' ఈసమస్య వెంకన్నను బాధపెట్టడం ఎక్కువయింది. ఎక్కడో ఒక లేగదూడను సంపాదించాడు వెంకన్న. సంవత్సరమన్నర కంటవత్తికొని పెంచాడు. ఆఖరుకది నూరురూపాయలు చేసేకోడెగా తయారైంది. వెంకన్నకు ధైర్యం వచ్చింది.

ఒకనాడు వెంకన్న కోడెనుతీసుకొని భీమయ్యవద్దకు వెళ్లాడు. 'కోడెకు నూరు రూపాయలు ధరకట్టారు. దాన్ని తీసుకొని వడ్డీని లెక్కించకుండా పత్రాన్నియిచ్చి రక్షించండి. ఆకోడెతప్ప వేరుమార్గంలేదు అప్పుతీర్చడానికి' అని ఎంతోదీనంగా చెప్పు కున్నాడు.

అప్పటికి భీమయ్యకు యివ్వవలసిన మొత్తం మూడేళ్లకు 190 రు. అసలు తనకు వేరుసెనగ యివ్వలేదు. ఆఖరుకు తన అప్పుకుభూమికూడా మిగల్లేదు. ఆకోపంవుంది భీమయ్యకు. అందుచేత వడ్డీకి కోడెను జమ పెట్టుకుంటానుగాని పత్రాన్ని యివ్వనన్నాడు భీమయ్య. మానాన్నగారుకూడా పత్రాన్ని యిచ్చి బీదవాణ్ణి రక్షించమని చెప్పి చూశారు భీమయ్యకు. వుపయోగం లేక పోయింది. పైగా మాదిగకుంకని వెనకవేసు కొనవస్తున్నారని మానాన్నగారిపైన దురభి ప్రాయం కలిగింది.

ఏమైందో యేమో వారంరోజుల్లో ఆకోడె హటాత్తుగా చనిపోయింది. దాంతో వెంకన్నకు మతిపోయింది.

అదివఱకే పత్రానికి ఆయువు దగ్గ రించింది. అందుచేత భీమయ్య చెప్పిపంపాడు వెంకన్న కోడెను తీసుకొనివస్తే యేదో విధంగా పరిష్కారం చేసుకుందామని. వెంకన్న మాచెర్లవైపే తిరిగిచూడలేదు. భీమన్న నయభయాలు రెండూ వెంకన్నను కదలించలేదు. అతడు సాహుకారికి ముఖం చూపలేదు.

పత్రానికి మేరమీరింది. గత్యంతరం లేక ఎవరిచేతనో పత్రానికి చెల్లువ్రాయించు కున్నాడు భీమయ్య. పత్రానికి ప్రాణం వచ్చిందనుకున్నాడు. వెంకన్నకు ఆసంగతి తెలియదు.

ఉన్నట్టుండి వెంకన్నకు గుంటూరు డిస్ట్రిక్టుమునిసిఫ్‌కోర్టునుండి సమనువచ్చింది. భీమయ్య పత్రము దాఖలుచేశాడు.

ఎప్పటిలాగే భీమయ్య తన కేసుకు నారాయణాచారిని తనవకీలుగా నియమించాడు. ఆచార్లు ధనవంతుడు; పలుకుబడిగలవాడు; మావూళ్ళో అదిమరింత. అయినా మా నాన్నకు శిష్యుడు. ఆయనయెడ గురుభావం గలవాడు. డబ్బు గడించేదాల్లోమాత్రం ఆచార్లు త్రొక్కనిత్రోవే లేదు.

వాదివకీలు 'ఫలానా' అని తెలిసినతరువాత మానాన్నకొకవిధమైన ధైర్యం కలిగింది. మొదటనుంచీ జరిగినసంగతీ, అసలు పత్రంలోని దొంగచెల్లు, వెంకన్న దీనదశా ఆచార్లగారికి తెలియచేస్తే తనపైనవుండే గురుభావంతో భీమయ్యకుచెప్పి వెంకన్నను రక్షిస్తాడని మానాన్న ఆశయం. అయితే స్నేహితానికి, గురుత్వానికి, సాయానికి వచ్చే డబ్బు పోగొట్టుకొని తనక్లయింటుకు అసంతృప్తి కలిగింపడు వకీలు. అదిమాత్రం మరచారు మానాన్న.

కష్టపడి నాలుగురూపాయలు సంపాదించుకొన్నాడు వెంకన్న. మానాన్న వెంకన్ననుతీసుకొని గుంటూరు వెళ్లారు. ఆచార్లను దర్శించారు. వెంకన్న కనపడుతూనే వకీలు 'ఏమిరా! మాదిగవెధవవు. ఇచ్చినడబ్బు ఎగవేయుడమే కాకుండా పిలిపిస్తేకూడా కనపడకుండా తిరుగుతావు?' అని నాంది మొదలుపెట్టినారు.

సావధానంగా వకీలుకు అన్నివిషయాలు చెప్పారు మానాన్న. వెంకన్న దుర్భరపరిస్థితుల్లోవున్నా అప్పుతీర్చడానికి ప్రయత్నించాడనీ, భీమయ్య గర్వంతో, ఆశతో అవకాశం పోగొట్టుకొన్నాడనీ,పత్రానికి మేర మీరిందిగనుక దిక్కులేని వెంకన్నను బాధించడంవల్ల ఉపయోగంలేదనీ మానాన్న వాదన.

దానికాచార్లవారిబదులిది 'ఈవెధవకింత పొగరా? వీన్ని జైలుకుపంపిస్తాను. లేకపోతే జీవితమంతా భీమయ్యవద్ద జీతానికుండి అప్పు తీర్చేటట్టుచేస్తాను. అంతేగాని వీనివిషయంలో మీరు జోక్యం పుచ్చుకుంటే నాకు చాలా నొప్పిగలుగుతుంది. నన్నైనాచూచి వీనికి మీరు సాయపడకూడదు.'

ఆచార్లు ఏవేవోచెప్పి వెంకన్న చేత బొటనవ్రేలి గుర్తు వేయించుకో చూచేడు. మానాన్న అది కానీయకుండా కళ్లతోనే సరిచేశారు. మానాన్న పట్టుదల ఆచార్ల అమితాగ్రహానికి కారణమైంది.

పత్రానికి వ్రాసిన చెల్లు అసలుతిప్పని కోర్టులో నిరూపించాలని మానాన్న పట్టుపట్టారు. మిగిలినమార్గ మదొక్కటే. ఆవిధంగా న్యాయానికై పోరాడ్డానికి కాలమూ, డబ్బూ, సహాయమూ కావాలి. దరిద్రులకు మొదటిది పుష్కలంగావుంటుంది. తక్కినవి రెండూ దొరకవు.

వారు తిరిగి యింటికి వచ్చారు. ఇక వాయిదాకు వెళ్లాలి. కర్చులకు డబ్బా? వాయిదా వారంరోజులుంది. మానాన్న ఆస్తీ ఆదాయమూ కుటుంబం పొట్టకు సరిపోతుంది కాని ముడికిరాదు. ఏదోవిధం

గా కొంతడబ్బు సముదాయించుకున్నారు కోర్టుకర్చులకు. అయితే రాకపోకలకు?

డబ్బుకొరకు బాధపడ్డంకంటె నడిచి వెళ్లేదే మంచిదనుకున్నారు. గుంటూరికి మావూరు పాతికమైళ్లకు పైగావుంటుంది. నడిచే ఓపిక కొంచమైనాలేకున్నా అంగీకరించారు మానాన్న నడవడానికి. వెంకన్నకు కొత్తజోడుపైన తన మిత్రున్ని, సహాయుణ్ణి తీసికొని వెళ్లాలని మోజుపుట్టింది. వెంటనే ప్రారంభించాడు పని. రెండు దినాలు నిద్రాహారాలు మానేసి ముగించాడు క్రొత్తజోడును. ప్రయాణానికి రెండు విమానాలని సిద్ధపరచినంత సంతోషించాడు వెంకన్న. వాని ఉత్సాహమూ కృతజ్ఞతా చూచి మురిసిపోయాడు మానాన్న. దరిద్రుకు కష్టజీవులకు పరస్పర బహుమానా లటువంటివే. ఆ చెప్పులే మానాన్నను గుంటూరికి తీసికొనివెళ్లి తీసికొనివచ్చినవి. కోర్టులో 'ఆన్సరు' పెట్టుకుంటామని చెప్పించారు. వారికి సరియైన వకీలును కుదుర్చుకొన్నారు. తిరిగివచ్చారు.

అప్పటినుండీ ఆచార్లు, భీమయ్యవారి తాలూకు మనుషులకు మానాన్న అన్నా, వెంకన్నన్నా అతిచేదైపోయింది. బలవంతులకు ప్రాపకం జాస్తి కాబట్టి బీదవాళ్లమీద కష్టాలు కురిశాయి; కురిపింపబడ్డాయి. ఏమైనాసరే యీకేసులో న్యాయం కలగడానికి దేనితోనైనా పోరాడాలనుకున్నారు స్నేహితులిద్దరూ. కాని స్వల్పకాలంలోనే ఒక్క మరణంతోటి ఒక్కదివసమైనా పోరాడలేకపోయారు మానాన్న.

వెంకన్న మొదలుపెట్టాడు. 'విన్నారా బాబూ! ఎన్నోకష్టాల్లో అడుగామడగా నడుస్తున్నా అన్యాయం జరుగుతూవుంటే చూళ్లేక వృద్ధాప్యంలో గుంటూరువరకూ వచ్చారు నాకోసరము. నాజోడును ఎన్నో మార్లు మెచ్చుకున్నారు. అంచేత దాన్ని బాబుగారి జ్ఞాపకార్థంగా వుంచుకుంటానన్నాను. నాకింకేమీవద్దు.'

సత్యంగా ఆజోడు గొప్పత్యాగాన్ని చూచింది. గొప్పపనికి తోడ్పడింది. అటువంటిది తప్పకుండా జ్ఞాపకచిహ్నమే. వెంకన్నా నీ హృదయం ఎంత ఉత్తమమైంది?

# ఒకే వృక్షమునుండి పలురకముల ఫలములు

శ్రీ చిలకమర్తి లక్ష్మణాచార్యులుగారు

(తోటపని)

### మొగ్గ చిగురు తొడుగుట (Budding)

ఈపని సులభమైనదే కాని, మిక్కిలి నాజూకుతనమును, కౌశలమును చూపవలసిన పని. ఈ పని యందు ఒక మంచివృక్షముయొక్క చిగురు (మొగ్గ)ను తీసి అదేజాతి మరియొక వృక్షముపైనాటి పెరుగునట్లు చేయుట. మంచి రకము నారింజమొగ్గను నీచజాతి చెట్టుపై నాటి, పెంచి మంచిజాతి కాయలను కాపింపవచ్చును. నారింజ (మొగ్గచిగురు)ను నిమ్మ చెట్టుపై నాటుటకూడ కలదు. కాని జాతులు (families) వేరైనపుడు ఈపద్ధతి పనికిరాదు. గులాబీ (మొగ్గచిగురు) నారింజచెట్టుపై నాటబడదు. ఈ పద్ధతివలన విచిత్రమైన మొక్కలను సృష్టిలోనికి తేవచ్చును. రెండురకముల గులాబీపువ్వులను ఒకే చెట్టుపై పూయింపవచ్చును.

ఈపనిని నవంబరు మొదలు ఫిబ్రవరి మాసమువరకును చేయవచ్చును. గాలి చల్లగాను, తేమగాను ఉండవలెను. వర్షము ఉండగూడదు. ఈ సున్నితమైన పని అంటుకట్టుటకంటె మిక్కిలి శ్రేష్ఠమైనది. ఎందుచేతననగా ఈచిగురు త్వరలో పెరిగి స్వల్పకాలములో ఫలితమునిచ్చును.

తల్లిచెట్టుయొద్దకేగి నడిమివయస్సు కలిగిన కొమ్మపై చిగురును ఎంచి మంచిచిగుళ్లను కోయు చాకుతో (budding knife) చిగురుకు పావంగుళము క్రిందుగా నాటునుపెట్టి చిగురుక్రిందికి కర్రభాగము ఒక పావంగుళమువరకును కోయవలెను. ఈకోత ఒకే కోతగా నుండవలెను. ఈ చిగురును తల్లికొమ్మనుండి విడతీసినవెంటనే దానిని ఆలస్యముచేయకుండా అంటు చెట్టువద్దకు తీసుకువెళ్లవలెను. కొంచెము ఆలస్యమైన యెడల గాని, దూరముగా తీసుకొని వెళ్లవలసివచ్చిన యెడల గాని దీనిని మెత్తటి తడిగుడ్డమడతలోనుంచి తీసుకువెళ్లవలెను. చిగురునకు అపాయమురాకుండ చిగురుక్రింద ఆకు ఉండినయెడల దానిని తీసివేయవలెను. అపుడు చిగురుక్రిందనుండు కర్రభాగమును చాకుకొనతో పైతొక్కకు ప్రమాదము వాటిల్లకుండ తీసివేయవలెను. ఆ కర్రభాగమును తీసి చూచినయెడల అచ్చట ఒక చిన్నచొట్ట కనిపించును. వెంటనే అంటుచెట్టుయొద్దకేగి నడిమివయస్సుకలిగి త్వరగా ఎదుగుకొమ్మను ఎంచుకొనవలెను. ఈ చిగురును తొడుగుకొమ్మను నిర్ధారణచేసికొని ఈక్రింద చెప్పబోవు పని చేయవలెను. ఈపని చేయుటకు మామిడి, నిమ్మ మొదలగు ఫలవృక్షములలో పైకొమ్మలును, గులాబి మొదలగు పూమొక్కలలో అడుగుకొమ్మలును శ్రేష్ఠము.

అంటుకొమ్మను చూచుకొని పదునైనకత్తితో చిగురున్న పేడు ఎంత పొడవుగానుండునో అంతకంటె కొంచెము హెచ్చుగా T మాదిరి కోతను కోయవలెను. అపుడు ఆ తొక్కలను పదిలముగా ఇరువైపులకును శ్రమాణము (forceps)తో ప్రక్కలకు త్రోసిపట్టి ఈ చిగురును తొక్కలనడుమకు సరిగా పోవునట్లుచేసి, సరిగా అమర్చవలెను. రెండు వైపుల తొక్కలను దగ్గరకు తీసికొనివచ్చి చిగురు కదిలిపోకుండా అరటిచొప్ప తాటితోగాని రాఫియా త్రాటితోగాని చిగురున కిరుప్రక్కలను చిగురున కేమియు అపాయములేకుండ గట్టిగా కట్టుకట్టవలెను. చిగురు బాగుగా బయటకు కనిపించుచు గాలి తగులు

నట్లుగాయుండవలెను. ఎండ ఎంతమాత్రమును తగుల రాదు. వర్షము కురిసినప్పుడు అచ్చటికి నీరు చేర రాదు. అరటితాటిపై చిగురుకు తగులకుండా కొంచెము మైనము పూతపూయుట మంచిది. కొన్నిదినములకు ఆచిగురు ఆకొమ్మలో లీనమై పెరిగి తల్లిచెట్టువలె పుష్పములను, కాయలను కాయును. ఈపద్ధతి నిమ్మ, నారింజ, బత్తాయి మొదలగు ఫలవృక్షములలోను, అనేకరకముల గులాబి మొక్కలను కలుపుటలోను, ప్లంసు, పీచస్సు, రేగు మొదలగు చిన్న ఫలవృక్షములలోను ఈ పద్ధతిప్రకారము రెండు మూడు రకముల పుష్పములను కాని, ఫలములను కాని ఒకేచెట్టుపై ఫలించునట్లు చేయవచ్చును. సాధారణముగా చిగురును శ్రేష్ఠమైన మొక్కనుండి తీసి సులభముగాను క్లిష్టపరిస్థితులందు పెరుగు నీచజాతి చెట్లపై ఈ చిగుళ్లను నాటుచుందురు. ఈచిగురు తొడిగిన క్రిందనున్న చిగుళ్లను ఎదుగకుండా త్రుంచి వేయవలెను. అట్లు చేసినయెడల మనము తొడిగిన చిగురునకు చాల ఆహారము వెళ్లి దానిని త్వరగా ఎదుగునట్లు చేయును. మనము తొడిగిన చిగురుపై నున్న కొమ్మలను, ఆకులను రెమ్మలనుకూడ త్రుంచి వేయుట మంచిది. సాధారణముగా కత్తిరింపు అయిన తరువాత వచ్చు కొమ్మలలో ఈచిగుళ్లను తొడుగుట శ్రేష్టము. T కోత కోయునపుడు పై బెరడు తొక్కను మాత్రమే కోయవలెను గాని లోపలి కర్రభాగము ఎంతమాత్రము తెగకూడదు. తొడుగు చిగురు బడ్డింగుకత్తి దంతపుపిడిపైనుంచి నిలువుగా బెరడులోనికి దూర్చి రెండు వైపులకు కోయబడిన బెరడును చిగురుయొక్క బెరడుతో సరిసమానముగా వచ్చి కలియునట్లు చేయవలెను. చిగురుయొక్క బెరడు T కోతలోనికి సరిగాపోయి, చిగురుమాత్రము పైకిఉండి బెరడు మూడువైపులను T కోతతో సమముగా చేరవలెను. అప్పుడు బెరడుయొక్క కలయిక సరిగానుండి త్వరగా అతుకుకొనును. కోత ఎంత పరిశుభ్రముగా నున్నయెడల కలయిక అంత బాగుగానుండును.

పైనిచెప్పిన విధముననే ఓగురుతొడుగుట కింకొక మార్గము కలదు. తల్లిచెట్టుమీద చిగురుతోనున్న బెరడును చతుర్భుజాకారముగా (Rectangular) కత్తితో నాటుపెట్టి, చిట్లిపోకుండ పెల్లగించి, దానిని కావలసినంత పరిమాణము కలిగిన చతుర్భుజాకారముగా కత్తిరించవలెను. అంటుచెట్టుపైకూడ ఆదేమాదిరి బెరడును చీల్చి ఈ చిగురుతోనున్న బెరడును దానియందు సరిగానతికి అరటితాటితో గట్టిగాకట్టి చిగురునకు బాగుగా వెలుతురు గాలి తగులునట్లుచేసి కట్టులోనికి నీరు చొరకుండా మైనము పూత పూయవలెను. మొగ్గను అంటుచెట్టువద్దకు ఎంత శీఘ్రముగా పట్టుకువెళ్లిన అంతమంచిది. ఈపద్ధతిప్రకారము బత్తాయి చిగురును వెలగచెట్టుపైవేసి పెంచి కాయలను కాయించుటయందు కృతార్థులైనారు. చిగురు తొడుగుటకు మిక్కిలి నేర్పరితనము చూపవలెను. మొదట కొన్ని పాడైనయెడల నిరుత్సాహపడరాదు. అనుభవమువల్లగాని కత్తి నుపయోగించువిధము తెలియదు. కత్తితో కోయుకోతలు వంకరలు లేకుండ హెచ్చుతగ్గులు లేకుండా సరిసమానముగా అతినున్నితముగా నుండవలయును. కోత మొదటినుండి చిగురువరకును ఒకే కోతగా నుండవలెను. లేనియెడల హెచ్చుతగ్గులు వచ్చి అంటుకొనుట పాడగును. కోసిన స్థలమునకు ఎండగాని విస్తారము గాలిగాని తగులనీయకూడదు. ఈ చిగుళ్లు తొడుగుట మొక్కలు ఎక్కువ గాని గుళ్లుపెట్టి బాగుగాపెరుగు సమయమునందు గాలి చల్లగాను, తేమగాను ఉన్నపుడు చేయవలెను.

పైచెప్పిన ప్రకారము అంట్లు కట్టుటవలన మనకు నచ్చిన రకముల వృక్షములను అన్ని చోట్లకును వ్యాపింపచేయవచ్చును. కొన్నిరకముల విత్తనములు కొన్ని ప్రదేశములందు అభివృద్ధిపొందియు ఫలింపక పోవచ్చును. అట్టి ప్రదేశములలో బాగుగా పెరుగు

నీచజాతి చెట్లపై మంచిజాతి అంట్లనుకట్టియు, చిగురు తొడిగియు ఫలింపచేయవచ్చును. కాని అంటుచెట్టు తల్లికొమ్మకు తన గుణములనే యిచ్చి తల్లి చెట్టుగుణములను చెరపవచ్చును. కాని యిది సాధారణముగా జరుగదు. అందువలన అంటుచెట్టు తల్లిచెట్టు గుణము చెరపకుండా ఉండునదిగా అనుభవమువల్లనే తెలుసుకొనవలెను. ఒకజాతిలోనే కొన్నిరకముల చెట్లు కొన్ని భూములలో పెరుగవు. ఒకవేళ పెరిగినను మంచి కాపు కాయవు. కొన్నిరకముల చెట్లయొక్క వేళ్లు కొన్నిరకముల భూములలోనికి జొరబడి ఆహారమును సంపాదింపజాలవు. అట్టి క్లిష్టపరిస్థితులయందు ఈ అంటుకట్టు మార్గములచే మనకిష్టమువచ్చిన జాతిచెట్లను మనకు వలసిన ప్రదేశములందు ఫలించునట్లు చేయవచ్చును.

మంచిజాతి చెట్లయొక్క విత్తనములు అన్నియు మంచిచెట్లనే యిచ్చుననుకొనుట పొరబాటు. తల్లి చెట్టు అన్నివిధములుగను మంచి ఫలములనిచ్చినను దానియొక్క విత్తనములు తల్లిచెట్టునకు విరుద్ధమయిన గుణములు కలిగిన చెట్లనిచ్చును. అట్టి సందర్భములలో అంట్లుకట్టుటవలన, చిగురుతొడుగుటవలన పైచెప్పిన అనర్థము వాటిల్లదు. ఎందుచేతననగా అవి సాధారణముగా తల్లి గుణములనే కలిగియుండును. కొన్నిచోట్ల నీజాతిచెట్లు పెద్దవిగా ఎదిగినపుడు వాటిని నిర్మూలము చేయకయే వాటిపైమంచి జాతికొమ్మలు పెరుగునట్లు చేసి నీచజాతి కొమ్మలను నిర్మూలము చేయవచ్చును. పూచెట్లయందు ఒకేచెట్టుపై ఒకేజాతి అదేజాతి పలువిధములగు పుష్పములు పూయునట్లు చేయవచ్చును. ఇది చూచుటకు మిక్కిలి చిత్రముగానుండును. ఒక గులాబీమొక్కపై ఒకకొమ్మ ఒకరకము పుష్పములను పూయించుట అందరికిని వినోదముగానుండును. కొన్ని మొక్కలకు తెగుళ్లు సులభముగా వచ్చుచుండును. అదే జాతి యింకొకరకపు మొక్కకు ఆతెగులు రాకుండా చేసికొను శక్తినికలిగి యుండవచ్చును. అట్టి సందర్భములో తెగులు అంటకుండా చేసికొనుశక్తిగల చిగుళ్లను తెగులు సులభముగావచ్చు చెట్లపైనాటి ఆవృక్షములను విస్తరింపచేసి ఫలసాయము నిచ్చునవిగా చేయవచ్చును.

చిగుళ్లను ఒకచెట్టుపైనుండి మరియొకచెట్టుపై చేయునప్పుడు తల్లిమొక్కకును, అంటుయొక్కకును మిక్కిలి దగ్గర సంబంధముండవలెను. గులాబీ చిగుళ్లను గులాబీ చెట్లపైననే నాటవలెను. మామిడి చిగుళ్లను ఇతర రకపు మామిడిచెట్లపయినే నాటవలెను. కాని జీడి మామిడిచిగురును మామిడిచెట్టుపై తొడిగినయెడల అది బ్రతుకదు. కాని కొన్ని చిత్రమైన అంటులను చూడగలము. నిమ్మచిగురును వెలగచెట్టుపైని తొడుగుటయు సపోటాకొమ్మను పాలచెట్టుపై అంటుకట్టుటయు వీలగును. భూమిపాడి ఆరుకు పోయినపుడును, వర్షములధికముగా కురియునప్పుడును అంట్లు కట్టకూడదు. నవంబరు మొదలు ఫిబ్రవరివరకును అంట్లుకట్టుటకు తగిన సమయము.

అంట్లుకట్టుటవలనను చిగుళ్లతొడుగుటవలనను ఒక రకపుచెట్టును ఎల్లకాలమును ఉండునట్లు చేయవచ్చును విత్తనములనుపాతి ఫలసాయమును అనుభవింపదలచినచో చాలకాలము పట్టుటయేగాక కోరిన ఫలము నీయక పోవచ్చును. పైనిచెప్పిన విధముగా వృక్షములను పెంచినయెడల అతిత్వరితముగా కోరిన ఫలముల ననుభవింపవచ్చును. చిగురు తొడుగుటకు కత్తిరింపు చేసిన తరువాత బయలుదేరు చిగుళ్లు శ్రేష్ఠము.



శ్రీ శారదానికేతన విద్యార్థినులు



శ్రీ శారదానికేతనమందలి అనాథబాలికలు

(ఎడమనుండి కుడివైపున)

కళ్యాణి: 10 సం.లు వయస్సు. రాయవేలూరు జైలులోనుండి లామెంబరుగారు 1931-వ సం. లో నికేతన కార్యదర్శి గారి స్వాధీనము చేసిరి. అప్పటి వయసు 3 సం.

రామతులసి: 1929 వ సం. బందరుజిల్లాజడ్జిగారిచే ఒప్పగించబడినది.

శారద: 1927 వ సం. గుంటూరుజిల్లాజడ్జిగారిచే ఒప్పగింపబడినది. అప్పటి వయస్సు 2½ సం. లు.

జయశీల: కర్నూలు డాక్టరుగారి ద్వారా మేజస్ట్రీటుగారి సర్టిఫికేటుతో ఒప్పగింపబడినది. అప్పటి వయస్సు 3 సం. లు.

నలుగురుబాలికలును నికేతనము వారి ఉచితపోషణ విద్య పొందుచున్నారు. వీరిలో నిరువురికి ఉదారులు రెండు స్కాలర్ షిప్పులిచ్చుచున్నారు.



శ్రీ గుంటూరు శారదానికేతన ఉపాధ్యాయిని వర్గము

# పుష్పచయము

## స్వాతంత్ర్యం కావాలంటే—

స్త్రీలు స్వాతంత్ర్యమును బడయవలయునన్న మహిళాసంఘములను విరివిగా స్థాపించి స్త్రీలలో పూర్తిగా చైతన్యమును కలుగజేసి సామ్రాజ్యవ్యతిరేకవాద సంఘములన్నిటితో సమ్మిళితమొనర్చి సామ్రాజ్యవాదమును భగ్నమొనర్చుటకు తీవ్రపోరాటమును సాగించవలయును.

ఈవిషయములో ఒక సంగతిమాత్రము మీరు గ్రహించవలె. ఇంతవరకు మనదేశములో స్త్రీయుద్యమము జమీందారుల భార్యలయొక్కయు యుద్యోగస్థుల భార్యలయొక్కయు చేతులలో ఉన్నది. వారు ఏదో ఆందోళనద్వారా స్వల్పసంస్కరణముల కాసించువారేకాని స్వాతంత్ర్యాది హక్కులకు పోరాడువారుకారు. కాబట్టి అట్టి మహిళోద్యమముగాగాక వ్యక్తిత్వముతోను త్యాగముతోను ప్రజాసామాన్యముతోను గూడిన సంస్థలుగానుండి పూర్ణమైన వర్గచైతన్యమును కలుగజేసి పోరాడిననేగాని మనమునకొనిన యితరదేశములలో ననుభవించుచున్న పూర్ణస్వాతంత్ర్యమును పొందజాలము. ఈ ఆదర్శములతోగూడిన మహిళాసంఘములు అన్నిజిల్లాలలోను, రాష్ట్రిలలోను స్థాపించి పూర్తిగా కృషి చేయవలయును.

ఈవిషయములో మరొకగమనిక. స్త్రీయనిన నొక విలాసవస్తువనియు, వంటయింట పనికత్తెయనియు పిల్లలుకనుయంత్రమనియు మాత్రమే తలపోయు జాతీయనాయకులు నేడుగూడాయుండుట మన దురదృష్టము. అట్టినాయకులు మన స్త్రీస్వాతంత్ర్యమును ఆర్థికహక్కులను అరికట్టుటకు అన్నివిధముల ప్రయత్నించుచు స్త్రీలు గృహలక్ష్ములనియు, మాతలనియును, రత్నాలనియును, ఏవేవో కొన్నిపొగడ్తలతో మోసగించుచుండిరి. మరియు మనక్షేమాభిలాషులవలె గృహాధికారము ఇచ్చితిమని నాలుగణాలు చేతిలోపెట్టి నాలుగుగోడలమధ్య బంధించి పంజరములోన బంధించినచిలుకకు పంజరముపై పెత్తనమిచ్చితిమన్నట్లు సర్వస్వాతంత్ర్యముల నరికట్టి సంతృప్తిపరుప జూచుచున్నారు. కాన నీబంధముల త్రెంచుటకు నెట్టికష్టములకైననోర్చి మన కార్యసాఫల్యమునకు అతిజాగరూకతతో మెలంగవలయును.

వల్లభనేని శీతామహాలక్ష్మమ్మగారు—ప.గో. జిల్లామహిళాసభలో.

*  *  *  *

## స్త్రీస్వాతంత్ర్యము ఇప్పుడెందుకు కావలసివచ్చింది?

పూర్వకాలంలో స్త్రీలకు స్వాతంత్ర్యం లేదా? ఈస్వాతంత్ర్యం యిప్పుడు స్త్రీలకు యెందుకు కావలసివచ్చింది. పూర్వం దేశకాలపాత్రాదులననుసరించి మహర్షులు త్రికాలాలను బాగాచూచి నియమపూర్వకంగా గార్హస్థ్యము నిర్వహింపబడడానికి కొన్నినియమాల నేర్పాటుచేశారు. వాటినే పరమప్రమాణంగాభావించి పూర్వులందరు సుఖదుఃఖాలను లెక్కచేయకుండా అలాగే ఆచరించేవారు. పతిభక్తే గతియని పతియే దైవమని అతని సుఖదుఃఖాలే తనసుఖదుఃఖాలని శాస్త్రాలు బోధిస్తున్నై. ఏవిషయంలోకూడ స్త్రీ

స్వేచ్ఛలేదు. అడుగుపెట్టడానికికూడ స్త్రీ ఒకరిఅనుమతిపై ఆధారపడి ఉండేది. "పితా రక్షతి కౌమారే, భర్తారక్షతి యౌవనే, రక్షంతి వార్ధకేపుత్రాః, నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అని చెప్పారు.

భార్యయొక్క సుఖదుఃఖాలతో పనిలేదు. సర్వము భర్త అధీనమే. భర్త యెటువంటివాడైనా సరే, అతనికిలోబడి ఉండవలసిందే. అప్పుడే ఆమె పతివ్రత అవుతుంది. ఈపాతివ్రత్యం పరలోకంలో సుఖసాధన మవుతుంది. అనేవిషయాలు శాస్త్రాలలో ప్రతిపాదింపబడినై. ఆకాలానికి తగినట్లు భర్తలుకూడ భార్యలను సర్వవిధాల ఏలాటిలోపాన్ని కలుగజేయకుండా సుఖమయంగా కాలాన్ని గడిపేవారు. ఆకాలం సర్వవిధాల న్యాయబద్ధంగా ఉండేది.

ఇప్పుడలాకాదు. ఆదృష్టితో కార్యాలను నెరవేర్చలేము. కాలం పూర్తిగా మారింది. "కాలపరివర్తనమున కలుగుమార్పు, మనుజభావంబులునుమారు మానకంత" అన్నట్లు కాలపరివర్తనంతోపాటు మనుష్యులభావాలుకూడ పూర్తిగా మారాయి. మారటం సహజం. మార్పుకలగక మానదు. కాలవేగాన్ని అరికట్టలేము. ఇప్పటి సమయాల్నిబట్టి కొన్నివిషయాలలో స్త్రీలకు పూర్తిగా అన్యాయం జరుగుతూఉంది. వివాహాలు, విద్యావిషయము ఆర్థికము మొదలైనవాటిలో పురుషులతోపాటు స్త్రీలకుకూడ సౌకర్యాలు కలిగింపకపోవడం అన్యాయం. పురుషులకున్న అధికారాలవంటివి స్త్రీలకుకూడ తప్పక కాంక్షణీయాలు.

పసుపులేటి లలితాదేవి___శారదానికేతన వార్షికోత్సవంలో.

*   *   *   *

మనలోని లోపాలను ముందు సంస్కరించుకోవాలి

ఆంధ్రులందరిలోకి నిరంతర లక్ష్మీసంపన్నులు వైశ్యులు. మనము వారి గృహలక్ష్ములము. అర్ధాంగలక్ష్ములము. అంతవరకే. నిజమువకుకూడ ఒక్కపైసా కర్చుచేయుటకు మనకు అధికారముండదు. తండ్రి లక్షాధికారి కానిండు. భర్త కోటీశ్వరుడు కానిండు. ఒంటిమీద వేలకిమ్మతుచేయు నగలుండనిండు. తన చేతిమీదుగా నాలుగుపైసలు కర్చుచేయుటకు అనుజ్ఞ దొరకుట కష్టము. కనుక స్త్రీలకు తండ్రియింట నుండి అన్నదమ్ములతో సమానముగా ఆస్తిలభించునట్లునూ, భర్త ఆస్తియందుగూడా సంపూర్ణాధికారము పొందునట్లును మనము కోరవలసియున్నది.

ఆడబిడ్డ భూమిమీదపడ్డ క్షణంనుంచే మంత్రసానికట్నంతో ఆరంభం ఆమెను తక్కువగాచూడడం. ఇక పెరుగుతున్నకొద్దీ ఇన్నియన్ని గాదామెకు నిర్బంధాలు. ఎగురగూడదు. మగపిల్లలతో తిరుగకూడదు. బయట తిరుగకూడదు. మగపిల్లవాడు హాయిగా స్వేచ్ఛగా బయటతిరిగి ప్రపంచజ్ఞానం సంపాదించి ఎదుగుతుంటాడు. ఆడపిల్ల అమ్మకు సాయంచేయడంతప్ప మరొకటి చేతకాకుండా అణగారుతుంది. ఎందువలన ఇదంతాను. మనస్త్రీలలోని ఆధిక్యతను సృష్టినిర్మాణములో మనస్థానమును పురుషులకు మన ఆవశ్యకతను గుర్తించలేక తమను తామే తక్కువచేసికొని తాము యీనీచత ననుభవించుటకే పుట్టితిమని అనుకొనుచుండుట వలన పురుషులుగూడా మనలను తక్కువగానే చూచుచున్నారు. కనుక మనముగూడ ప్రపంచములో పురుషులతో సమానత్వము ననుభవింపవలెనన్న మనలోగల ఈలోపములను సవరించుకొని చిన్నప్పటినుండే అన

పిల్లనుగూడ గౌరవముగా పెంచి అన్ని విషయములలోను మనసీచత్వమును తొలగించుకొనవలయును.

సంబూరి మహాలక్ష్మమ్మ—హైదరాబాదు ఆర్యవైశ్య మహిళాసభలో

*    *    *    *

## భుక్తికి పనికివచ్చు విద్యావిధానము అవసరము

ప్రకృతకాలమున విద్యావిధానమునందు కొన్ని మార్పు లత్యవసరములు. భుక్తిముక్తియనిగదా క్రమము? భుక్తిదొరికిననేగాని ముక్తిదొరకదు. కనుక ముందు విద్య భుక్తిని చేకూర్చునదిగా నుండవలెను. ఇప్పుడు విద్వాన్ భాషాప్రవీణ మున్నగు యూనివర్సిటీపరీక్షలకు స్త్రీలను తయారుచేయుచున్నారు. ఇంతమాత్రమున పరిపూర్ణమైన గమ్యస్థానము దొరికినట్లు సంతోషింపరాదు. పైపరీక్షలలో సంస్కృతాంధ్రములలో మాత్రమే ఒక విధమగు జ్ఞానమలవడును. ఇదిచాలదు. ఇదియైనను చదివి యుత్తీర్ణులైన వారందరికిని జీవనోపాధి (ఉద్యోగములు) లభించునని గట్టిగా చెప్పుటకువీలులేదు. ఇప్పటికి ఈపరీక్షలిచ్చినవారు తక్కువ గనుక ఉద్యోగము దొరికినను క్రమముగా చాలమంది యిదేచదివినచో ఇప్పటి విద్వాన్ శిరోమణ్యాది బిరుదములందిన పురుషులగతియే వీరికిని చేకూరగలదు. కనుక విద్యయనునది నిర్విచారముగా తనజీవనము గడుపుకొనుటకు సాధనమై యుండవలెను. అట్లుండుటకు వృత్తివిద్యలు నేర్చుకొనుటతప్ప వేరొక గతిలేదు. ఇట్టివిధానమునే వార్ధావిద్యావిధానమను పేర గాంధీమహాత్ముడు సూచించుచున్నాడు. ఈవిధానము దేశమందంతటను నిర్బంధముగా నేర్పవలెను. అందు స్త్రీలకు వేరుగా కొన్ని నియమించి నేర్పుటమంచిది. స్త్రీపురుషులకు భేదము ప్రకృతిసిద్ధము. దానిని నేము తీసివేయజూచుట యసంభవము. కనుక వృత్తి విద్యలలో స్త్రీప్రకృతి కనుగుణమగు వానిని కొన్నిటినేర్పఱచి యొకవిద్యావిధానమును తయారుచేయుట యత్యవసరము. అట్లగుచో స్వతంత్రముగా సక్రమమగుమార్గమున జీవనమును గడుపుటకు సావకాశము కలుగును.

కుర్రా పద్మిని—శారదానికేతన వార్షికోత్సవంలో.

*    *    *    *

## 'లవ్-మీటర్' (ప్రేమకొలతబద్ద) చెప్పివేస్తుంది

'కాముకులు ఇకముందు, ఇప్పటిమాదిరే చేయిచేయి కలుపుకొని వెన్నెలలో విహరిస్తారు కాని, వాళ్ల జేబులలో ఒక చిన్న 'లవ్-మీటర్' ఉంటుంది. అది ఒకళ్లమీద మరొకరిప్రేమ యెంతుందో కొలిచి చెప్పుతుంది' అని ప్రొఫెసరు A. M. లా అనే లండన్ సైకాలజిస్టుగారు జోస్యము చెప్పుతూ.

"ఇది చాలా విపరీతంగా కనిపించవచ్చుగాని స్త్రీపురుషులప్రణయాన్ని శాస్త్రరీత్యా కొలవడమే ఉత్తరోత్తరంగా మానవకల్యాణ సంపాదనకు ఉత్తమమార్గమని భవిష్యత్తు వచించకపోదు.

"పరస్పర సహాయకములగు సమానగుణములుగల యిరువురకు కుదురుస్నేహమే ప్రణయమనదగును. అట్టిప్రణయము 'కైర్ లెస్' కిరణములవలె ప్రత్యేకములైన కిరణాలను (rays) ప్రభవింపజేయును.

"'స్పీడామీటర్' ఒక మోటార్ స్పీడును కొలిచేటట్టు మనుష్యులప్రణయాన్నికూడా ఒక యంత్రము ద్వారా కొలవవచ్చు. నేను అట్టియంత్రమునకు 'లవ్ మీటర్' అని నామకరణంచేసి దానితో పరిశోధనలు చేస్తున్నాను.

"దీనివల్ల యువతులు యువకులు తగునైన భార్యాభర్తలను ఎన్నుకోవడానికి వీలుంటుంది. ప్రణయమనేది ఇకనైనా కవులచేతినుంచి తప్పించి శాస్త్రపరిశోధకులు తీసుకుంటే బాగుంటుంది." అన్నారు.

*　　　*　　　*　　　*

## నూఱేండ్లుదాటినా పెళ్లిళ్లే

ఆసియామైనరులో చామర్ అనే గ్రామంలో చావోచ్ అనే 102 వయస్సుగల ఒకమహానుభావుడు ఇంకా (5 వ సారి) పెళ్లిచేసుకునేందుకు తీవ్రప్రయత్నాలు చేస్తున్నాడట. తాను పెళ్లిచేసుకోబోయే స్త్రీ వయస్సు 45.

ఆయనకొడుకులు, మనమళ్లు, మునిమనమళ్లు ఇదివద్దంటూ ముసలితనం కారణంగా చెప్పినారు. ఆయనెందుకు వింటాడు? 'నేను క్రిమియాయుద్ధములో పాల్గొన్నాను. దినదినం నాకు బలమెచ్చుతూ ఉన్నది. 30 ఏండ్ల యువకులకంటె నిజముగా నేను యౌవనవంతుణ్ణి. వారానికి మూడుసార్లు 7 మైళ్లవతల ఉన్న గ్రామానికివెళ్లి ఆరోజుకాలోనే తిరిగివస్తుంటాను' అని అంటాడట.

*　　　*　　　*　　　*

## స్వర్ణనిషేధము

ఆభరణ, అలంకృతులకు బంగారు వాడువిషయములో జపాన్‌లో ఒక నూతనశాసనప్రకారము నిషేధములు హెచ్చినవి. ఇందువల్ల మిగులు బంగారమంతయు చీనాయుద్ధమునకై ప్రోగుచేయుటయే దీని యంతరార్థమట.

బంగారుతో చేయబడు గడియారములు, ఉంగరములు, గొలుసులు, పిన్నులు, గుండీలు—ఇవికూడ తయారుచేయుట ఒక నేరముగా భావింపబడును. గిల్టుఅక్షరములను పుస్తకములపైకూడా వాడరాదు.

*　　　*　　　*　　　*

## పందొమ్మిదేండ్లకే పార్లమెంటు సభ్యురాలు

ప్రపంచములోకెల్ల అల్పవయస్కురాలైన పార్లమెంటు రష్యాది. అందలి సభ్యులలో అందరికంటె వయస్సులో చిన్నవారు ఒక ఫ్యాక్టరీలో పనిచేయుచున్న ఒక పందొమ్మిదేండ్ల కన్య. అయిదుగురు ఇరువదేండ్లవారు. సగమునకుపైగా సభ్యులు నలువదేండ్లలోపు వయస్సువారు.

# గ్రంథపరిచయము

## ఆంధ్ర వాచస్పత్యము

శ్రీయుత కొట్ర శ్యామలకామశాస్త్రిగారిచే కరపనుండి వెలువరింపబడుచున్న ఆంధ్ర వాచస్పత్యము 17, 18 భాగములు మాకందినవి. 17వ భాగమున 'నిప్పట్టు' మొదలు 'పల్లగించు' వఱకుగల పదములును, 18వ భాగమున 'పల్లగేరె' మొదలు 'ప్రొట్ట' వఱకుగల పదములును గలవు. ఒక్కొక్క భాగము వెల రూపాయి.

## జవహర్లాలు వ్యాసములు (కొన్ని ఉపన్యాసములు సహా).

గ్రంథకర్త: శ్రీమాన్ కోమాండూరి శఠకోపాచార్యులుగారు, M.A.,B.L., వకీలు, కాకినాడ. వెల 8 అణాలు.

శ్రీమాన్ శఠకోపాచార్యులు గ్రంథకర్తలుగా ఇదివరకే సుప్రసిద్ధులు. ఆచార్యులవారి జగత్కథ, తాతాచరిత్రము, నెహ్రూచరిత్రము లోనగు గ్రంథము లాంధ్రులకు సుపరిచితములే. వీరు జవహరలాలుగారి వ్యాసములను ఉపన్యాసములను ఒక పుస్తకరూపమున ప్రసాదించుట ఆంధ్రలోకమునకు నిజముగా మహోపకారమనదగినది. భారతదేశమును ప్రస్తుతము కలవరపెట్టుచున్న పెక్కు సమస్యలకు జవహరుని దృక్పథ మెట్టిదో యరసి తనచేనైనంత సాయపడుటకు నీ గ్రంథము సాధనము కాగలదు. జవహరలాలుయొక్క 'Whither India' అను 'అద్భుతరచన' నిందలి 'మనగమ్యము' అనువాదము. మహాత్మాగాంధిగారి విషయమై ఆయన (నెహ్రూ) అభిప్రాయము లెట్టివో చాలమంది పొరపడుచుందురని గ్రంథకర్తగారు తలచి India and the World అను జవహరుని గ్రంథమునుండి మహాత్మా గాంధి అను వ్యాసము ననువదించిరి. కార్మిక కర్షక సమస్యల విషయమై జవహరులాలుగారి తత్త్వమును 'కాన్పూరు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సందేశము', 'బొంబాయి ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఉపన్యాసము' అను రెండు వ్యాసములందు స్పష్టము కాగలదు. ఈ గ్రంథమున అన్నిటికంటె 'భాషాసమస్య' అను వ్యాసము ముఖ్యతమమని భావించవచ్చును. తెలుగు దేశమున 'గ్రాంథికమా, గ్రామ్యమా' అని నేటికిని తెగకుండు సమస్యపై నెహ్రూగారి యభిప్రాయమును తిలకింపుడు: "వాఙ్మయము లిప్పుడు కృత్రిమములై జనతతో సంబంధము లేకున్నవి. గ్రంథకర్తలు, విలేఖరులు, తమ పాండిత్యప్రకర్షకై కాక సామాన్యజనుల లాభమునకై వ్రాయవలయును. జనులలో విద్యాగంధము వ్యాపించినమీదట సామాన్యపాఠకుల కొఱకే లేఖకులు వ్రాయుదురు. ఇప్పుడు లేఖకులు పండితశైలిని వ్రాయుచున్నారు. అది దురభ్యాసము. చదువనేర్చిన సామాన్యులకై సులభశైలిలోనే వ్రాయవలెను. అప్పుడే భాషాశైలి సులభమగును; ఆడంబరముపోయి శక్తి యేర్పడును. ఇప్పటి సంస్కృతికి రాజసభలుగాక సామాన్యజనులే ఆధారము. కనుక వారికొఱకై మాటలనేగాక మన భావములను గూడ సుబోధకముగనే వ్రాయవలెను. జనుల కష్టసుఖములను వారి అవసరములను ఆశలను చర్చించవలెను. మన సాహిత్యము జనసామాన్యపు జీవితమునకు ప్రతిబింబముగనుండవలెను. అప్పుడే దానికి జీవము, పోషణము ఉండును......"

ఈ గ్రంథములో నొక్కొకటియు అమూల్యమైన వ్యాసము. అందలి గుణములు చర్చిస పూనుకొన్నచో మరియొక గ్రంథమే వ్రాయవలసివచ్చును.

శ్రీమాక్ ఆచార్యులవారి శైలి అత్యంతరసవంతము, సులభమును. ఏతత్ గ్రంథపఠనమువల్ల పఠితకు గలుగు లాభము ముమ్మాటికి మేరలేదన్న అతిశయోక్తి గాజాలదు. వీనినన్నిటి చేర్చి కూర్చి గ్రంథరూపేణ ప్రకటించిన శ్రీమాక్ ఆచార్యులవారికి ఆంధ్రలోకము మిక్కిలి కృతజ్ఞత చూపుటకు ప్రతియాంధ్రుడొక గ్రంథమును కొని చదువుటయే మార్గము. [గ. ప.]

## స్పెయిన్ దుఃస్థితి

కర్త: శ్రీ ప్రతాపరామసుబ్బయ్యగారు, ప్రకాశకులు, నమ్మాళ్వార్స్, తపాలుపెట్టె, 251, మద్రాసు. వెల 6 అణాలు.

"ప్రస్తుతము భారతదేశమును కలవరపెట్టుచున్న రాజకీయములు, ఆర్థిక వాణిజ్య సంబంధములు, కథలు, కావ్యములు, నాటకములు, అంతర్జాతీయ వ్యవహారవిమర్శనలు, ఆంధ్రపురాణములు లోనగు గ్రంథములు నెలకు రెండు చొప్పున ప్రకటించబడును" అని ప్రకాశకులు వెల్లడిచేయుచున్నారు. నేటి దేశ కాల పరిస్థితులలో నిట్టి యుద్దేశము మిక్కిలి ప్రశంసనీయమే. 'ఆంగ్లమున పెలికన్ పెంగ్విన్ సీరీస్' ఇట్టివే. వానివలె నమ్మాళ్ వారును గ్రంథము ఖరీదు ఆ అణాలే పెట్టుటకూడ చాల ఉచితమే. జనసామాన్యమునకు సులభముగ బోధపడు శైలిలో ఉద్గ్రంథపఠనకు నిట్టిగ్రంథములే దోహదమొసగగలవు.

స్పెయిన్‌లోని జమీందారీవిధానమే అక్కడి సాంఘిక అశాంతికి కారణము. ఫాసిస్టు, మిలిటరి దోపిడిగాండ్రు సర్వశక్తులు వినియోగించి ఏలాగైన ఆర్థిక రాజకీయ స్వతంత్రతను నశింపజేయుచున్నారు. ఈ దోపిడితనమును పోగొట్టుటకు సామ్రాజ్య వ్యతిరేకపోరాటమును పెంపొందించవలెను. "స్పెయిన్ మహాయుద్ధములో తేలవలసియున్న సాంఘిక అంతర్జాతీయ సమస్యలు అబద్ధప్రచారంవల్ల మరుగుపడియున్నాయి" అను గ్రంథకర్తవాక్యము గుర్తింపదగినది. తటస్థవిధానము పేరుతో బ్రిటన్, ఫ్రాన్సులోని ప్రభుత్వములు అప్రత్యక్షముగ ఫ్రాంకోకు ఎట్లు సహాయపడుచున్నవో గ్రంథకర్తగారు విశదముగ తెల్పియున్నారు. స్పెయిన్‌లోని అత్యాచారాలు, అన్యాయాలు, అక్రమాలు మనకు వింతవిషయములే. కాంగ్రెసు పుణ్యమా అని ఈ స్పెయిన్ దుఃస్థితి మనకెల్లరకు పూర్తిగా హృదయంగమమైనది. 'ప్రతిచోటను స్వాతంత్ర్యప్రియులైనవారు ఇంపీరియలిజంచేత పీడించబడు ప్రతివర్గంవారును తమ శక్తి కొలది స్పెయిన్‌కు వెంటనే సహాయము చేయవలసిన ఆవశ్యకత' ఈ గ్రంథము చదివిన బోధపడగలదు. శైలి చక్కని వ్యవహారభాష. ఇట్టి గ్రంథముల ప్రకటించిన 'నమ్మాళ్వార్స్' ప్రజల మన్ననలకు పాత్రులగుటలో విపరీతమేమి? [గ. ప.]

## శశాంక

ఆంధ్రపాఠకలోకంలో గుడిపాటివారి రచనలను చదవనివారుగానీ చదివి శాపనార్థాలు కొంచెమో గొప్పో చదివించనివారుగాని వుండరు. సంఘసంస్కారుల్లో అతివాదులున్నారు. అతివాదుల్లో అతివాదులుకూడా వీరివాదన ఒప్పుకోరు. అయితే నియమనిబంధనలకూ, నీతినిష్ఠలకూ, ఆచారవ్యవహారాలకు, మైళ్లదూరంలోవుంటూ పరార్థంకంటే స్వార్థం జీవితోద్దేశంగావుండే కొంతమందికి అవి అమృతప్రాయంగా వుంటవని ప్రతివారూ అనుకోవడం అలవాటు. అంచేత గుడిపాటివారిసృష్టిలో ఉత్తమపాత్రలు—పైవిధమైన పక్షపాతం వున్నవాళ్లనీ లేనివాళ్లనుకూడా మెప్పించేవి—వుంటాయా అనే సందేహం కలగడం వింతగాదు.

శశాంక ఒకపెద్ద గ్రంథంకాదు. అందులోని విషయం నూతనమూ కాదు. అయినా అది ఇంతవరకు

గ్రంథకర్తకువుండే కళంకాన్ని చాలవఱకుపోగొట్టి ఆంధ్రసారస్వతంలో అపూర్వపాత్రలపట్టికి మరి కొందరిని చేర్చింది. భారతసంఘమంతా ఏకగ్రీవంగా నీతిబాహ్యమన్నకథనే తీసుకుని అందులోనే అనూరాధ వంటిపాత్రను సృష్టించడమూ యుగయుగాలనుండి పనికిమాలినవాళ్లల్లో ప్రథముడుగా లెక్కపెట్టబడిన బృహస్పతికి నిజమైన దివ్యత్వం చేకూర్చడమూ శకాం కలోని అద్భుతగుణాలు. గ్రంథకర్త కథాంశాలు వేరేఎత్తుకుని ఇటువంటి సృష్టినింకాచేస్తే ఎంతో బాగుంటుంది. దీన్ని నమ్మాళ్వార్సు, తపాలుపెట్టె 251, మద్రాసువారు ప్రకటించి ఆరణాలకే అమ్మడం బాగుంది.

చ. రా.

---

# పత్రికాలోకము

## హిందూసుందరి—స్వర్ణ సంక్రాంతి సంచిక.

ఈసంచిక పెక్కుమంది పద్యగద్య వ్యాసములతో నలరారుచున్నది. 32 సంవత్సరములనుండియు వ్యయప్రయాసలకోర్చి జ్ఞానప్రబోధమే ఆశయముగాపెట్టుకొని స్త్రీలకొఱకై నడుపబడుచున్న యీపత్రిక సంపాదకీయములో 'అనేక పర్యాయములు స్త్రీలోకమున కంజలించి వ్యాసములనీయ ప్రార్థించినను ఏలాగో ఆంధ్రసోదరీమణులు మాపత్రికయందు 'శీత కన్ను'మాపుట విచారనీయము' అని వ్రాయుట ఆంధ్రరచయిత్రీమణుల బద్ధకమునకొక ప్రబలనిదర్శనము. ఇన్నిసంవత్సరములుగా కృషిచేయుపత్రికకే ఆత్మాభివృద్ధినైనగోరి రచనల నంపజాలని రచయిత్రులకది యుచితముగాదని విన్నవించుచున్నాము. సర్వవిధముల ఆంధ్రులీ పత్రికకుతోడ్పడి నిలువక కొనసాగునటుల జూడగోరదము.

## మాతృసేవ.

సంపాదకుడు శ్రీ పసుమర్తి వీరభద్రస్వామి, బి.ఏ., ఎం.ఎల్.సి. ఇది విజయనగరమునుండి ప్రచురింపబడు జాతీయ పక్షపత్రిక. జాతీయసభా కార్యక్రమముపై నాధారపడి నడుపబడుచున్నది. ఇట్టి పత్రికలు విరివిగ బైలుదేరుచుండుట దేశాభివృద్ధికి సూచకము. ఇది యభివృద్ధిచెంద కాంక్షింతుము.

సాలు చందా రు. 1—8—0 విడిప్రతి 0—0—9

## కథాంజలి. ✓

సంపాదకుడు: శ్రీ ఎ. ఎన్. రాఘవాచారిగారు, 32, కృష్ణప్పనాయకవీధి, జార్జిటౌన్, మదరాసు.

సాలు చందా రు. 1. విడిప్రతి ఒక అణా.

ఇది ప్రతిమాసము 5 వ తేది వెలువడు సచిత్రమాసపత్రిక. ఇందులో చాలభాగం చిన్నచిన్న కథలు. ఇతరవిషయాలక్కటేవు. అభివృద్ధిపొందునని ఆశింతుము.




## శారదాచట్ట సవరణలు

శాంతిసమితికిని శారదాచట్టమునకును పోలికలు చాలకలవు. రెండింటి ఆశయములు గొప్పవే. రెండును మహాసంరంభముతో నారంభమైనవి. కాని రెండును తమ ఆశయములను నెరవేర్చుకొనలేక పోయినవి. పైపెచ్చుగ తమకనులయెదుటనే తమ ఆశయములకు వ్యతిరేకముగ నన్యాయములు జరుగుచుండ చచ్చుపెద్దమ్మలవలె చూచుచునూరకున్నవి.

శారదాచట్టము బ్రిటిషు పరిపాలనరాష్ట్రములకే వర్తించుననుటతో స్వదేశసంస్థానములు, పోర్చుగీస్, ఫ్రెంచి పరిపాలిత భాగములు బాల్యవివాహములకు రంగములైనవి. అంతియగాదు. ఈ చట్టమును ధిక్కరించినను ఇతరులెవరేని పూనుకొని ఎంతయో ప్రయత్నించిననేగాని ధిక్కారనేరము శిక్షింపబడదు. శిక్షయు 'లెక్కాజమా' లేనిది.

ఈచట్టమునకుగల యీకొరంతము లంతరించిపోవు కాలమువచ్చినది. ఈచట్టము హిందూదేశమునకంతయు వర్తింపవలెనని శ్రీయుత లాల్చందు నవల్‌రాయి గారొక సవరణను ప్రవేశపెట్టిరి. అది చట్టమైనది.

బాల్యవివాహము లాచరించుటకు స్వదేశసంస్థానములను, విదేశపరిపాలితభాగములను శరణ్యములుగా నెంచుకొనియున్న సనాతనాచారపరాయణుల కాయండయు దూరమైనది. ఇక వారు చట్టమును ధిక్కరించి తమయింటనే వివాహము లాచరింపవలసియున్నది. 'ఇంతవఱకటుల చేయుట లేదా? 'కల్లలైనాచెప్పి కళ్యాణాలు చేయించాలట' అని 'అట'లను పట్టుకొని ప్రాకులాడు మహామహులు, 'ఎవరెక్కడపోతే మనకెందుకు?' అని 'నాన్ ఇంటర్‌వెన్షన్' పద్ధతి నవలంభించు ప్రముఖులు ఉన్నంతకాలము శారదాచట్టము శవాకృతిగా నుండవలసినదే గదా!' అని యుండుటకుకూడ వీలులేదు.

ఇకమీాదట నీచట్టనిరసనము నేరముగా పరిగణించి ప్రభుత్వమువారే చర్య బుచ్చుకొనవలెను. శిక్షలింకను కఠినము గావలెను. ఇట్టివివాహములు జరుగుచున్నవని ముందే తెలిసినచో, లేక ఇతరులు తెలిపినచో జరుగకుండుటకు న్యాయమూర్తులు ఇంజన్‌క్షన్ అర్డరు ఇవ్వవలయును. ఒకవేళ వివాహములైనను అవి చట్టసమ్మతముగావనియే నిర్ణయింపవలెను. అని శ్రీయుత బి. దాసుగారొకబిల్లును శాసన

సభయందు ప్రవేశపెట్టియున్నారు. దానికి ప్రభుత్వముకూడ సుముఖమైయున్నది. ఆ బిల్లిపుడు సెలెక్టుకమిటి యధీనము చేయబడినది. అదికూడ త్వరలో చట్టరూపము దాల్చునని యాశింతుము.

* * *

శారదానికేతన వార్షికోత్సవము.

నికేతనవార్షికోత్సవ సందర్భమున సమావేశమైన స్త్రీల ప్రత్యేకసభ కధ్యక్షతవహించుచు శ్రీమతి లింగంగుంట బుచ్చిలక్ష్మమ్మగారు (శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారికొమార్తె) 'ఉన్నవ దంపతులు దేనిని పట్టుపట్టి చేయదలంచినను ఆ కార్యము కొనసాగింపగల సామర్థ్యము వారియందుగలదు. వయసు హెచ్చినకొలది వారింతవఱకు చేయుచున్నట్టికృషి నింతసులభముగ చేయఁజాలరు. ఎందుకన మనోధార్ఢ్యమున్నను శరీరధార్ఢ్యము తగ్గిపోవుట ప్రకృతిసిద్ధము. కావున స్త్రీ విద్యాభిమానులందఱు నికేతనమున కెక్కుడు సహాయముచేసి మూలధనము నేర్పాటుచేసినచో వారిశ్రమ తగ్గించిన వారగుదురు.' అన్నారు. ఇదిసత్యము. గమనార్హము.

వార్షికోత్సవమున పాల్గొన్న మంత్రిగారును, ప్రభుత్వకార్యదర్శులును నికేతనమువలన ఆంధ్రదేశమునకు గలుగుచుండెడి మేళ్లనుగూర్చి వాకొని వారిట్టియభిప్రాయమునే వెలిబుచ్చిరి.

నికేతనము త్యాగధనమే పునాదిగా బైలుదేరినది. సంస్థాపకులకృషియు, కార్యదీక్షయు, నికేతనోపయోగమును చెప్పవలసివచ్చిన చర్వితచర్వణమగును. ఇవన్నియు దెలిసియు, నికేతనఫలితముల ననుభవించుచున్న ఆంధ్రలోకము పై సూచనను కార్యరూపము దాల్పజేయుగాక.

* * *

ఆంధ్రమహిళాగానసభ-రాజమహేంద్రవరం

దాక్షిణాత్యుల గానకళాభివృద్ధికి కావలసినసరకు 'సప్లై'చేసినవారాంధ్రులు. పరిగ్రహించి అభివృద్ధి పొందుచున్నవారు తమిళులు. ఇచ్చియూరకయున్నవారాంధ్రులు. తెచ్చుకొని బాగుపడినవారు తమిళులు.

చదువు రాకపోయినను సంగీతము తప్పక రావలయు ననెడివారు దాక్షిణాత్యులు. చిన్నపుడు సంగీతమునేర్వని బాలికలచట అరుదు. అట్లు సంగీతము నేర్వకుండుట వారికి న్యూనత.

ఆంధ్రదేశమున నీయలవాటు లేదు. పరిస్థితులు పరిసరములు అనుకూలముగనుండియు సంగీతము పిల్లలకు చెప్పించు నలవాటు పెద్దపెద్దపట్టణములందును లేకుండుట విచారణీయాంశము. ఒకవేళయున్నను సులభముగాపోవునని హార్మోనియముతో సంగీతము ప్రారంభింతురు. ఇంకను హార్మోనియము మనసంగీతవాద్యములలో ముఖ్యమైనదిగా నుండుట మనదౌర్భాగ్యము. సహజసంపదతోనున్న చిన్నిబాలికల కోయిల

కంఠములు హార్మోనియముయొక్క కఠోర స్వరమునబడి నలిగి నశించుచున్నవి. అది విషయాంతరము.

గానకళాభివృద్ధికై ఇపుడు ఆంధ్ర మహిళామణు లందుగలిగిన యుత్సాహము ముదమును గొలుపుచున్నది. రాజమహేంద్రవరమున శ్రీమతి నాళము సుశీలమ్మగారు నాల్గువత్సరములక్రింద 'మహిళా గానసభ' యనుసంస్థను స్థాపించిరి. ఈసభా వివరములు స్థలాంతరమున ముద్రింపబడినవి. వారి నిరంతరకృషిచే రాజమహేంద్రవరమున సంగీతసరస్వతి చిరుగంటలతో చిందుల త్రొక్కుచున్నది. సభాపక్షమున వారు గావించుసమావేశములు జరిపించుపోటీలు ఇతరుల కత్యుత్సాహకరములై యున్నవి. ఆయూరివారేగాక ఇతర పట్టణవాసులను కూడ నాకర్షించుచున్నవి. ఈసభను అఖిలాంధ్రగానసభగా చేయవలెననెడి యుద్దేశము వారికి గలదు. ప్రతిపట్టణమునందును మహిళామణు లీ యాశయములకు తోడ్పడవలెను. తమతమ పట్టణములందే ఈ సభా శాఖనో, ప్రత్యేకసభలలో నిర్మించుకొని ఆమూలమున సంగీతకళాభివృద్ధికి తోడ్పడెదరని నమ్ముచున్నాము. సంగీతసరస్వతికి జాగ్రదవస్థగల్గించిన శ్రీమతి నాళము సుశీలమ్మగారిని మిగుల నభినందించుచు వారి యాశయములు నెరవేరుగాకయని కోరుచున్నాము. * * *

ఉద్యమాభివృద్ధికి సింద ఎదురుచుక్క.

'గృహలక్ష్మి' స్త్రీలపత్రిక. స్త్రీల యభ్యుదయమునకై కంకణముగట్టుకొని కృషి చేయుచున్నది. వారియభివృద్ధికి భంగకరములైన వానినన్నింటిని నిరసించుచున్నది. అభివృద్ధి కాటపట్టులని తోచిన వానినెల్ల అనుసరించుచున్నది. ఇది యాంధ్ర నారీమణుల కీనాటివిషయముగాదు.

పత్రిక యిట్టిది. ఆశయము లిట్టివి. అట్టిచో ఒక్కొక్కచో ఆంధ్ర నారీరత్నములే తమ యభివృద్ధికని పురుషనిందచేయుట తటస్థించుచున్నది. వార లిది యేయుద్దేశముతో చేసినను మంచిదిగాదని ఇదివఱ కెన్నియో మార్లు గృహలక్ష్మి వాకొన్నది. అదే విషయమును పలుమారు సూచింపవలసి వచ్చినందు కెంతయు విచారము గలుగుచున్నది. ఇటీవలజరిగిన ఒక సమావేశములో డాక్టరు అచ్చమాంబగా రుపన్యసించుచు, పురుషులు స్త్రీలను మృగములరీతి దయాదాక్షిణ్యములులేక, హింసకు లోను జేయుచున్నారనియు, వారిని స్వార్థపరులై దుఃస్థితియందుంచియున్నారనియు నభిప్రాయము నెల్లడించినటుల వార్తలు దెలుపుచున్నవి. ఇట్టి వార్త లపుడపుడు వినవచ్చుచునేయున్నవి.

తప్పుచేయుట మానవనైజము. తప్పుచేసినవారికది నెయ్యమున చూపింతుమేని వారవి చాలవఱకు చక్కదిద్దుకొందురు—తమయజ్ఞానమునకు, మూర్ఖతకు ఆనందపడు చవటలుతప్ప. అటులగాక తప్పుచేసినారని నిందింతుమేని వారు బాగుపడుటరుదు. పైగా శాంతి వాతావరణమున

కేనియు భంగముకలుగును. ఇది వేదాంతముగాదు; నీతిగాదు. ప్రపంచానుభవము.

సంఘమున నియములు నిబంధనలు అభివృద్ధికే యేర్పరుపబడినవి. అవి కాలవైపరీత్యమునబడి ఆదియందుగల ఆశయములకు దూరములై యుండవచ్చును. అలహాటు, ఆచారముప్రకారము సంఘము వర్తించుచు వచ్చినది. ఇంతలో కాలము మారజొచ్చినది. మానవునికనులు దెరువబడినది. సంఘమున నెంతో మార్పు అవసరమని యాతనికే దోచినది. తరువాతనే సంస్కరణము లారంభమైనవి.

స్త్రీలను తనతో సమానముగ నాదరింపకపోవుట తనకును తనజాతికిని అభ్యుదయముగాదని పురుషుడెపుడు గుర్తెఱిగెనో నాటినుండియే స్త్రీలస్థితి బాగుజేయుటకాతడే ప్రయత్నించుచు వచ్చినాడు. వారియభివృద్ధిమార్గము వారికే నేర్పినాడు. అప్పటినుండియు స్త్రీపురుషులిరువురు ఈక్షణమువఱకు స్త్రీలయభ్యుదయమునకై పాటుపడుచునేయున్నారు. స్త్రీలకందఱికిది నూతనముగాదు.

అట్టిచో పురుషులతోడ్పాటుతో స్త్రీలు కావలసినయభివృద్ధి పొందగలరు. అదియు ననావశ్యకమందురేని తామే స్వంతముగ ప్రయత్నింపవచ్చును. ఈప్రయత్నములో పురుషులను నిందింపవలసిన యవశ్యకతయెంతమాత్రము లేదని వారెఱిగినదే గదా!

నిజమే. ఇదివఱకెపుడో వారు దోషమునుచేసిరి. స్త్రీలకు స్వాతంత్ర్యమియ్యక స్వార్థతను గనబరచిరి. అయితే తమదోషమును వారిపుడు గుర్తించిరి. తదేకదృష్టితో దానిని సవరించుకొన ప్రయత్నించుచున్నారు. అంతియగాదు స్వాతంత్ర్యోద్యమమును ప్రారంభించినది, విడువక సాగించుచున్నదికూడ వారే. అట్టిచో వారినినిందించిన గలుగుమేలెట్టిది? పరస్పరసహకారముతో నభివృద్ధిపొందు టుత్తమముగాని నిరసనలతో నిందలతో తమయుద్యమమును కళంకిత మొనరించుటకొనుట మంచిదిగాదని మాతలంపు. సోదరీమణులాలోచింతురుగాక.

* * *

హరిపుర కాంగ్రెసు సమావేశము

గుజరాతునందుగల హరిపురగ్రామమున 51-వ కాంగ్రెసుసమావేశము ముగిసినది. ఈసమావేశముతో కాంగ్రెసు ప్రతిభ, ప్రతిష్ఠ, ప్రాముఖ్యము, బలము, శక్తి, చేవ మరింత యెక్కువైనవి. స్వాతంత్ర్య సమరపథము భావికాలమున సుగమము గాకపోవచ్చును. అయినను కావలసినంతబలము, ఐకమత్యముకాంగ్రెసు సంపాదించుకొన్నది. దీనికి ముఖ్యకారణము మొన్నగలిగిన రాజకీయ సందిగ్ధస్థితి.

ఇది తలవనితలంపుగాగలిగిన సందిగ్ధావస్థ. ఆవఱకే ఎన్నియో సమస్యలను ప్రశాంతముగ చర్చించుచున్న కాంగ్రెసు సభకిది విపరీతముగ దోచినది. అచటచటనంతవఱకు పొడచూపియున్న అభిప్రాయభేదము లొక్కుమ్మడి యంతరించినవి. సభ్య

లందఱొక్కటిగా రానున్న సందిగ్ధావస్థ నెదుర్కొనుటకు సంసిద్ధులైనారు. వీరినందఱిని సక్రమమార్గముననడిపించి జయశ్రీని వరింపజేయు, ప్రతిభ, దివ్యశక్తి, ఆమహావ్యక్తి మహాత్మునినుండి వెలువడినది.

నూతనరాజ్యాంగశాసనప్రకారము రాజప్రతినిధికిని, గవర్నరులకును గల ప్రత్యేకాధికారములను, మంత్రులు తమ బాధ్యతలను సక్రమముగా నిర్వహించుచున్నంతవఱకు, వారుపయోగింపరని నమ్మకము గలిగినతరువాతనే మంత్రివర్గము లంగీకరింపబడినవి. ఇపుడు తద్వ్యతిరేకముగ రాజప్రతినిధి వర్తించుట జరిగినది. కాంగ్రెసు తన నియమము ననుసరించి ఇపుడు ప్రభుత్వమునందు క్లిష్ట పరిస్థితులగలిగింప జాలియున్నది. అయినను రాజప్రతినిధి తనచర్యను మరొకమారు పర్యాలోచింప అవకాశమొసగినది. ఇదియే జాతీయ మహాసభాసమావేశమందలి ముఖ్య తీర్మానము.

రాజకీయఖైదీలనందఱను ఏకకాలమున వెనుకముందు లాలోచింపక, విడచుట ప్రజాశాంతికి భంగమని రాజప్రతినిధివాదము. అందుకే తాము మంత్రుల పరిపాలనయందు జోక్యము పుచ్చుకొనవలసివచ్చినదట. 'ప్రజాశాంతికి భంగమురాకుండునట్లు మంత్రివర్గమే చూచును. ఆబాధ్యత వారిది. మీ రిట్టి వానియందు ప్రత్యేకాధికారముల నుపయోగించు టుత్తమముగాదు. మరియొకమారు చక్కగ నాలోచింపవలయును' అని జాతీయసభ మహాత్మునిముఖమున ప్రత్యుత్తరమిచ్చినది. నేడీ సమస్య ఉభయులకు తృప్తిగా బరిష్కరింపబడినది. ఈవఱకు మంత్రులు కోరినట్లు రాజకీయఖైదీల నందఱిని విడుదలచేయుటకు గవర్నర్లు ఒప్పుకొన్నారు.

త్వరలో రానున్న ఫెడరేషనును చేతనైనన్ని విధముల నడ్డపెట్టవలయునని యేకగ్రీవముగ నాయకులందఱంగీకరించినారు. జాతీయసభ తీర్మానము చేసినది. అధ్యక్షులీవిషయమున నమితమైన పట్టుదలతో నున్నట్లు వారి యధ్యక్షోపన్యాసమే స్పష్టపఱచుచున్నది. ఇతర నాయకులందఱాతని బలపఱచుచున్నారు.

ఈ పరిస్థితులవలన కాంగ్రెసునం దైకమత్యము మరింత ఘనీభవించినది. కాంగ్రెసునెడ సందంను పెరుగుచున్న అసంతృప్తి నశించినది. ఇది భారతమాత భావిభాగ్యోదయమునకు శుభసూచన. ఇంకను పరిష్కారముగాకయున్న హిందూమహమ్మదీయుల ఐకమత్యముకూడ త్వరలోనే సమకూడి కాంగ్రెసు బలము ద్విగుణీకృతమగునని యాశింతుము.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

లందఱొక్కటిగా రానున్న సందిగ్ధావస్థ నెదుర్కొనుటకు సంసిద్ధులైనారు. వీరినందఱిని సక్రమమార్గముననడిపించి జయశ్రీని వరింపజేయు, ప్రతిభ, దివ్యశక్తి, ఆమహావ్యక్తి మహాత్మునినుండి వెలువడినది.

నూతనరాజ్యాంగ శాసనప్రకారము రాజప్రతినిధికిని, గవర్నరులకును గల ప్రత్యేకాధికారములను, మంత్రులు తమ బాధ్యతలను సక్రమముగా నిర్వహించుచున్నంతవఱకు, వారుపయోగింపరని నమ్మకము గలిగినతరువాతనే మంత్రివర్గము లంగీకరింపబడినవి. ఇపుడు తద్వ్యతిరేకముగ రాజప్రతినిధి వర్తించుట జరిగినది. కాంగ్రెసు తన నియమము ననుసరించి ఇపుడు ప్రభుత్వమునందు క్లిష్ట పరిస్థితులగలిగించ జాలియున్నది. అయినను రాజప్రతినిధి తనచర్యను మరొకమారు పర్యాలోచింప అవకాశమొసగినది. ఇదియే జాతీయ మహాసభాసమావేశమందలి ముఖ్య తీర్మానము.

రాజకీయఖైదీలనందఱను ఏకకాలమున వెనుకముందు లాలోచింపక, విడచుట ప్రజాశాంతికి భంగమని రాజప్రతినిధివాదము. అందుకే తాము మంత్రుల పరిపాలనయందు జోక్యము పుచ్చుకొనవలసివచ్చినదట. 'ప్రజాశాంతికి భంగమురాకుండునట్లు మంత్రివర్గమే చూచును. ఆబాధ్యత వారిది. మీ రిట్టివానియందు ప్రత్యేకాధికారముల నుపయోగించుటుత్తమముగాదు. మరియొకమారు చక్కగ నాలోచింపవలయును' అని జాతీయసభ మహాత్మునిముఖమున ప్రత్యుత్తరమిచ్చినది. నేడీ సమస్య ఉభయులకు తృప్తిగా బరిష్కరింపబడినది. ఈవఱకు మంత్రులు కోరినట్లు రాజకీయఖైదీల నందఱిని విడుదలచేయుటకు గవర్నర్లు ఒప్పుకొన్నారు.

త్వరలో రానున్న ఫెడరేషనును చేతనైనన్ని విధముల నడ్డుపెట్టవలయునని యేకగ్రీవముగ నాయకులందఱంగీకరించినారు. జాతీయసభ తీర్మానము చేసినది. అధ్యక్షులీవిషయమున నమితమైన పట్టుదలతోనున్నట్లు వారి యధ్యక్షోపన్యాసమే స్పష్టపఱచుచున్నది. ఇతర నాయకులందఱాతని బలపఱచుచున్నారు.

ఈ పరిస్థితులవలన కాంగ్రెసునందైకమత్యము మరింత ఘనీభవించినది. కాంగ్రెసు నెడ సందంను పెరుగుచున్న అసంతృప్తి నశించినది. ఇది భారతమాత భావిభాగ్యోదయమునకు శుభసూచన. ఇంకను పరిష్కారముగాకయున్న హిందూమహమ్మదీయుల ఐకమత్యముకూడ త్వరలోనే సమకూడి కాంగ్రెసు బలము ద్విగుణీకృతమగునని యాశింతుము.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.